౧

యాదవుడూ మాధవుడూ సవతిబిడ్డలు. ఆసంగతి వారే మరచిపోగా లోకులుకూడా మరచిపోయారు. యాదవుడు పేదవాడయినా చాలా కష్టపడి మాధవుడికి బి. యల్. దాకా చదువు చెప్పించడమేకాకుండా వెతికివెతికి ఒక మహాధనికుని కూతుర్ని- బిందువాసిని అనే ఆమెను తనకు మరదలినిగా ఇంటికి తీసుకురాగలిగాడు. ఆ మహాధనికునికి ఈ బిందువాసిని ఒక్కత్తే కూతురు. ఆమె చాలా అందకత్తె. ఇంత అందమూ, పదివేల కట్నమూ తీసుకొని బిందువాసిని వచ్చిన రోజున ఈయింటి పెద్దకోడలు అన్నపూర్ణ కళ్ళవెంట ఆనందధార ప్రవహించింది. ఇంట్లో అత్తగారుగాని, ఆడబిడ్డలుగాని మరి లేరు. అన్నపూర్ణే ఇంటిపెద్ద. ఆమె బిందువాసినిచిబుకం ఎత్తిపట్టి "ఇంటికి పిల్లను తెచ్చుకుంటే ఇటువంటిపిల్లను తెచ్చుకోవాలి. అచ్చలక్ష్మి" అని అమ్మలక్కలందరిలో సగర్వంగా అన్నది. కాని రెండు రోజులలోనే ఇది పొరపాటని తేలిపోయింది. చిన్నకోడలు ఎంత రూపమూ, ఎంతడబ్బూ కూడా తీసుకునివచ్చిందో అంతకు నాలుగురెట్లు అహంకారమూ, అభిమానమూకూడా తీసుకొనివచ్చినట్లు తెలిసిపోయింది. ఒకనాడు అన్నపూర్ణ యాదవుణ్ణి చాటుగా పిలిచి, "రూపాన్నీ, రూపాయలనీ, చూచి చేసుకున్నారుగాని ఈపిల్ల తాచుపిల్ల సుమండీ" అని అన్నది.

యాదవుడు ఈమాట నమ్మలేదు. తల గోక్కుంటూ "ఆఁ! అలాగా!" అని రెండుసార్లని కచేరికి వెళ్ళిపోయాడు.

యాదవుడు చాలా నిమ్మళస్తుడు. జమీందారు కచేరిలో సముద్దారుపనిన్నీ, ఇంట్లో దేవతార్చనయున్నూ చేస్తూవుండేవాడు.

మాధవుడు అన్నకన్న పదిపన్నెండేండ్లు చిన్న. లా ప్యాసై ఇప్పుడే ప్లీడరీలో ప్రవేశించాడు.

అతడు వచ్చి— "ఏమండీ వదినెగారూ ? మా అన్నగారికి డబ్బే ఎక్కువలా గుంది; రెన్నాళ్ళు ఓపికపటితే నేనూ కొంచెం సంపాయించి ఆయ నకు తృప్తి కలిగిస్తాను" అని అన్నాడు.

అన్నపూర్ణ ఈమాటలు విని ఊరుకుంది.

ఇది ఇల్లా ఉండంగా ఒక విపత్తు వచ్చింది. చిన్న కోడలిని ఎవరూ ఏమీ అనడానికి వీలులేదు. ఆమెకు పెద్ద హిస్టీరియా. మూర్ఛ వచ్చినప్పుడు ఆమెకేసిచూస్తే ఇంటిల్లిపాదీ గజగజలాడిపోవలసిందే. డాక్టర్ను పిలవడంతప్ప వేఱు ఉపాయంలేదు. కాగా ఈసంబంధం దారి పొయ్యే దయ్యాన్ని కోరి తెచ్చుకున్నట్లు అయిందని అందరి మనస్సులకూ పట్టిపోయింది. యాదవుడు మాత్రం అందరికంటె భిన్నంగా "కాదుకా దలా క్కాదు. రెన్నాళ్లోపిక పట్టండి. జగద్ధాత్రి ఎంత అందగత్తో మాఅమ్మ అంత అందగత్తె. ఇంత అందమూ వమ్మైపోవడమే? ఎప్పటికీకాదు" అని అంటూ ఉండేవాడు.

ఒకనాడు మాటమాటా వచ్చి బిందువాసిని మొహంముడుచుక్కూచుంది. అంతటితో అన్నపూర్ణ ప్రాణా లెగిరిపోయై. హఠాత్తుగా ఆమెకేమితట్టిందోకాని ఇంట్లోకి పరుగెత్తి తొట్టెలో పడుకుని నిద్రపోతూన్న తన కొడుకుని ఏణ్ణర్థం వాణ్ణి తీసుగొచ్చి బిందువాసిని ఒళ్ళో పడేసి తాను తప్పుకుంది.

ఆకుర్రవాని పేరు అనంతం. తన కిల్లా నిద్రాభంగం కలిగించినందుకు గాను వాడు క్యారుక్యారుమని ఏడవడం మొదలుపెట్టాడు.

బిందువాసిని ప్రాణాలు ఒడ్డి మూర్ఛనుండి తనను రక్షించుకొని కుర్ర వాణ్ణి ఎత్తుకొని తన గదిలోకి వెళ్ళిపోయింది.

చాటునుండి ఇదంతా చూస్తున్న అన్నపూర్ణ బిందువాసిని జబ్బుకు ఈరీతిగా అమోఘమయిన దివ్యౌషధం కని పెట్టినందుకు పులకించిపోయింది.

సంసారభార మంతా తన తలమీదనే ఉండడంవల్ల అన్నపూర్ణ లిన్నగా పోషణ చేయలేకుండా ఉంది. విశేషించి పగలల్లా పనిపాటలు చేసు

గున్నాక రాత్రి నిద్రించడానికవకాశం లేకుండాపోతే ఆమెకు చాలా జబ్బు చేస్తుంది. సంగతి సందర్భాలిట్లా ఉండడంవల్ల కుర్రాడి భారమంతా బిందువాసిని తన తలమీద పెట్టుకుంది.

నెలరోజులిట్లా గడిచాక ఒకనాడు పొద్దున బిందువాసిని అనంతాన్ని చంకనెత్తుకొని వంటింట్లోకి వెళ్ళి "అక్కయ్యగారూ! అబ్బాయికి పాలేవీ?" అని అడిగింది.

అన్నపూర్ణ గభాలున చేతిలోపని పారేసి "ఒక్క నిమిషం ఓపికపట్టు చెల్లీ. పాలు కాగబెట్టిఇస్తా"నని బెదురుతూ బెదురుతూ అంది.

పాలు ఇంకా కాగకపోవటం చూచి బిందు మండిపడి— "ఎనిమిది కొట్టకముందే పాలుకాచి సిద్ధంగా ఉంచాలని నిన్నకూడా మీతో చెప్పాను. చూచారా ఇప్పుడు తొమ్మిది. ఈపని మీకింత బరువైపోతే ఆ సంగతి మీరు నాకు స్పష్టంగా చెప్పెయ్యండి. నే నింకో ఉపాయం చూచుకుంటా. సరే కాని, ఏమమ్మా వంటలక్కా! ఇంత పిండాకూడుకి రెండు నిమిషాలు ఆలస్యమైతే ఏమి మునిగిపోయింది ? నీకయినా ఈ పాలమాట కొంచెం గుర్తువుండనక్కరలా?" అని కరుకుగా అన్నది.

వంటలక్క మాటాడక కూరకుంది.

" మేమూ నీలాగే పిల్లాడికి బొట్టూ కాటుకా పెట్టుకుంటూ కూచుంటే మాకు గుర్తుంటుంది. సరే కాని ఓ నిమిషం కొంచెం ఓపికపట్టవమ్మా" అని అన్నపూర్ణ అంది.

"ఇహానుంచి నీవుగనుక అనంతుడిపాలల్లో వేలు పెడితే నామీద ఒట్టు! నేను గనుక వాడి పాలమాట నీతో చెపితే నీమీద ఒట్టు" అని బిందువాసిని ప్రత్యుత్తరమిచ్చింది

బిందు ఈలా ఒట్టెట్టుకుని కుర్రాణ్ణి కూలేసి పాలగిన్నెచ్చుకుని పొయిమీద పెట్టింది. కింద కూలెయ్యంగానే కుర్రాడు ఏడవడం మొదలు పెట్టాడు. బిందు వాడి దవడలు నొక్కి—"ఏడవకు గాడిదే? ఏడిచావంటే గొంతు పిసికి

చంపేస్తా" అని అన్నది. ఈ వ్యాపారం చూచి దాసీది పరుగెత్తుకొచ్చి కర్ర వాణ్ణి తీసుకొనబోయింది. బిందు దాన్ని చూచి "ఛీ! నీ వాతలకి పో" అని గదమాయించింది. ఆ గదమాయింపుతో అది ఇంకో అడుగు ముందరికి వెయ్య లేక ఎల్లా వున్న దల్లాగే నిలబడి పోయింది.

బిందు మరి మాటాడక. గుక్క పట్టి ఏడుస్తున్న కర్రవాణ్ణి ఎత్తుకుని, మళ్ళా పొయిదగ్గర కూచుని పాలుకాచడం మొదలు పెట్టింది.

అన్నపూర్ణ నిశ్చలంగా నిలుచుని ఉంది. పాలు కాచుకుని బిందువాసిని అక్కణ్ణుంచి వెళ్ళాక –"కర్రాణ్ణి నీవు పెంచమని ఒకనాడు నేను నవ్వ లాటకు అన్నాను. ఆ బలంతోటి, నామీదకూడా ఎంత ఒట్టు పెట్టిందో చూశావా!" అని అన్నపూర్ణ వంటమనిషితో అంది.

ఏలా అయితే నేం, అన్నపూర్ణ కొడుకు బిందువాసిని చేతుల్లో పెరిగి చిన్నని అమ్మాఅనిన్నీ అమ్మను అక్కా అనిన్నీ, పిలవడం నేర్చుకున్నాడు.

---

## ౨

నాలుగేంళ్లు గడచినయ్. అనంతుడికి అక్షరాభ్యాసము చేశారు. చాలా ఖర్చు చేశారు. ఆమరునాటి పొద్దున అన్నపూర్ణ వంటింట్లో తీరిక లేకుండా ఉంది. బిందువాసిని తలుపుదగ్గరకు వెళ్ళి — అక్కయ్యగారూ: అనంతం నమస్కారం చేయడానికి వొచ్చాడు. ఒక్కసారి ఈతలికి రండి" అని పిలిచింది.

అన్నపూర్ణ వచ్చి కుర్రవాడివేషం చూచి విస్తుపోయింది కళ్ళ రాటుక. బుగ్గమీద కాటుకబొట్టు. మెళ్ళోగొలుసు. తలమీద కేశకిరీటం. పసుపుపచ్చ కట్టుబట్ట, చేతిలో తాడుతో వేలాడదీసిన మట్టిసిరాబుడ్డి, చంకలో చదురుకు చుట్టబెట్టిన తాటాకులు.

"అక్కగారికి జేజేపెట్టు నాయనా" అని బిందువాసిని అన్నది.

అనంతం తల్లికి నమస్కారం చేశాడు. అతని కాళ్ళకు మేజోళ్ళు లేవు. బూడుసుల్లేవు. లాగూలూ చొక్కాలూ మొదలైన లాతి సరుకుల్లేవు. ఈ రీతిగా అపురూపంగా ఉన్న ఈ రూపం చూచి అన్నపూర్ణ నవ్వు మొహంతో "నీ తలలో ఎన్ని ఊహ లున్నాయమ్మా చెల్లీ? అబ్బాయి బహుశా బళ్లోకి వెళతాడా యేమిటి?" అని అడిగింది.

బిందు నవ్వుమొహంతో "అవును గంగయ్య పంతులుగారి బళ్ళోకి పంపుతా. అబ్బాయిజీతం సార్థక మయ్యేటట్టు ఈ నా డాశీర్వదించం డక్కయ్యగారూ" అని. "ఓసే భైరవా! అబ్బాయి నెవరయినా కొటతారేమో, జాగర్తగా చూడం డని నే చెప్పానని పంతులుగారితో చెప్పు!" అని నౌకరు కాజ్ఞాపించి. "అక్కయ్యగారూ! ఈఅయిదురూపాయలు తీసుకుని కొబ్బరీ బెల్లమూ తెప్పించి దాసీదానిచేత బళ్ళోకి పంపించండి" అని చాలా ప్రేమతో కుర్రాణ్ణి ముద్దెట్టుకుని చేతులలోకి తీసుకుని వెళ్ళిపోయింది.

అన్నపూర్ణ రెండుకళ్ళల్లోంచీ నీళ్ళు ఉబ్బుకొని వచ్చేయ్. ఆమె వంటలక్క నుద్దేశించి—"బిందుకు కన్నకడుపు కాకపోయినా కూర్రాడిమీదే పంచప్రాణాలూ. కన్నకడుపే అయితే ఇంకా ఏమేమి చేసేనో?" అనిఅన్నది.

"అందుకనే కాబోలు దేముడు ఆమెకడుపు పండించలేదు. పద్దెనిమిది పందొమ్మిదేళ్ళు వచ్చి—" అని వంటలక్క అంటూవుండగా బిందువాసిని ఒక్కత్తే తిరిగివచ్చి- "అక్కయ్యగారూ! బావగారితో చెప్పి మనయింటికెదురుగా బడి పెట్టించరాదమ్మా ? ఆ ఖర్చు నేను పెట్టుకుంటాను" అని అన్నది.

అన్నపూర్ణ నవ్వేసి "వాడింకా రెండడుగులు వేశాడో లేదో అప్పుడే నీవుద్దేశం మారిపోయిందటమ్మా? పోనీ నువ్వుగూడా వెళ్ళు. బళ్ళో కూచుందుగాని" అని అన్నది.

బిందు వెలవెలపోయి నవ్వి—"ఉద్దేశం మారడం కాదమ్మా! అబ్బాయి చాటున ఉండడం వేరు. కంటి ఎదట ఉండడం వేరు అని ఆలోచిస్తున్నా. పిల్లకాయ లందరూ పాడువాళ్ళు. అబ్బాయి కసుగాయ, వీణ్ణిపట్టుకొని కొట్టేస్తే?" అని అన్నది.

"కొట్టితే యేం? కుర్రాళ్ళు కొట్టుకోరూ? అందరూ పిల్లలూ ఒక్కటే. అదీగాక ఎవరిపిల్లలు వాళ్ళ కెక్కువ. అందరు తలిదండ్రులూ వాళ్ళవాళ్ళ పిల్లలను బళ్ళోకి పంపగా నీవుమాత్రం ఎందుకు పంపలేవు?" అని అన్నపూర్ణ అన్నది.

ఇతరులతో పోలికలు చూపెట్టడం బిందువాసినికి ఏమాత్రమూ గిట్టదు. అందువల్ల లోలోపలనే కుమిలి కాబోలు ఇల్లా అంది. "మీపద్ధతంతా వేరు, అక్కయ్యగారూ ఎవడైనా కలంపెట్టి కుర్రాడికన్ను పొడుస్తాడనుకోండి అప్పుడేం కావాలి?"

అన్నపూర్ణ బిందువాసిని భావం కనిపెట్టి నవ్వి "అలాగయితే డాక్టరుకు చూపెడుదు గాని. సరే కాని నీ కోమాట చెబుతున్నాను. వారంరోజులు కూచోని ఆలోచించినా "ఎవడయినా కలం పెట్టి కన్ను పొడవవచ్చు" ననే

ఊహా నాకు తట్టదు. ఇంతమంది పిల్లాళ్ళు బళ్ళోకి వెళుతున్నారు కాని ఎవడూ ఎవణ్ణీ కలం పెట్టి పొడిచినట్టు మరి వినలేదు" అని అన్నది.

"మీరు వినలేదు కాబట్టి ఇటువంటి పనులు జరగకపోతయిటమ్మా? మనకు తెలియకుండా జరిగేపను లెన్నిలేవూ? లేవని ఎవళ్ళయినా అనగలరా? సరే, ఇన్నిమాట లెందుకు గాని, ఒకసారి బావగారితో చెప్పిచూడ రాదూ? తరువాత ఏమయితే అదవుతుంది" అని బిందు అంది.

అన్నపూర్ణ గంభీరంగా- "ఏమవుతుందో అదినాకు కనబడుతూనే వుంది. ఏ దయినా ఒకటి కావాలని మనస్సులో అనుకుంటే నీవు మరి వదలడ మనేదివుంది గనకనా? నేనుమాత్రం సృష్టిలో ఎక్కడలేని ఇటువంటి కోరి కలు కోరలేను. నీవు వారితో మాటలాడవు గనుకనా? నీవే అడగరాదూ?" అని అన్నది.

బిందు కిప్పుడు కోపం వచ్చింది—"పోనీ, నేనే చెప్తాను. రోజూ నా కుర్రాణ్ణి నేను అంతదూరం నడిపించలేను. ఇది ఎవరికీ బాగుండనీ బాగుండక పోనీ! ఇందువల్ల అబ్బాయికి చదువురానీ రాకపోనీ! ఒసే కదంబా, కొబ్బెరి బెల్లమూ బళ్ళోకి పట్టికెళ్ళమని నీకు చెప్పలేదా? నోరుతెరచుకొని నుంచున్నా వేల?" అని అంది.

బిందుకు కోపంవచ్చినట్లు కనిపెట్టి అన్నపూర్ణ తొందరపడి—"కొబ్బరి బెల్లమూ కోరి నేనిస్తాను. గడబిడపడకమ్మా? నీకుర్రాడు పెరిగి పెద్దవాడు కాడూ? ఎప్పుడూ చంకలో దిగేసుక్కూచుంటావా యేమిటి? ఈసంగతి ఆలోచించుకోవేం?" అని అన్నది.

బిందు ఈమాటలకు జవాబుచెప్పక—"ఒసే కదంబీ! కొబ్బెరి బెల్లమూ బళ్ళోకి తీసికెళ్లు, అబ్బాయిని ఎత్తుకుపో! పంతులుగారికి దణ్ణం పెట్టించు! వెంటనే తీసుకురా! పంతులుగారిని సాయంకాలం ఒకసారి నేనిక్కడికి రమ్మన్నా నని చెప్పు. 'చెప్పినమాట తెలుసుకోలేకపోతే తెలపటం ఎల్లా? అందరికంటే

చిన్నవాడు కదా! వాణ్ణి కొట్టిపోతారేమో' అని అన్నా. దీనికేమిటీ జవాబూ! 'ఎప్పుడూ వీణ్ణి నీచేతులలో దాస్తావా' అనా? ఆహా! దాస్తానో దాచలేనో ఆసంగతి ఆలోచించడానికి నేనిక్కడికి రాలే" అని, ప్రత్యుత్తరం అపేక్షించ కుండా గబగబా వెళ్లి పోయింది.

అన్నపూర్ణకు నోటమాటరాలేదు. చూస్తూనిలబడి పోయింది.

"ఇంక నిలబడకండమ్మా! ఆమెగోరు మళ్లీ ఇప్పుడే వచ్చేసినా వచ్చేయ గలరు. ఆమెగోరి తలలో ఏమయినాదూరితే దాన్ని తిప్పటానికి బ్రహ్మ క్కూడా తరంకాదు" అని కదంబ అన్నది.

ఆనాటిరాత్రి యాదవుడు పొద్దోయింతరువాత మామూలుగా పక్క మీద వెలకిల పడుకుని, నల్లమందు వేసుగుని నిషామీద స్వారిచేస్తూఉండేసమ యంలో తలుపు గడియ గడగడలాడుతూ కదిలింది.

యాదవుడు అతికష్టంగా కళ్లుతెరచి "ఎవరది" అని అన్నాడు.

అన్నపూర్ణ లోపలికి వెళ్లి "మీ మరదలు ఏమిటో చెప్పటానికి వచ్చింది. వినండి" అని అన్నది.

యాదవుడు గబుక్కున లేచి కూచుని "ఎవరూ? చిన్నమ్మా? ఎందు కమ్మా?" అని అన్నాడు.

యాదవుడికి మరదలంటే చాలా వాత్సల్యం. మరదలు మాటాడక పోవటం చూచి అన్నపూర్ణ ఆమెకు బదులుగా తానే అందుకుని "ఈవిడ పిల్లాడికంట్లో బడి కుర్రాళ్లు కలంపెట్టి పొడుస్తారట! అందుకోసమని మన యింట్లోనే బడి పెట్టించాలట" అని అన్నది.

యాదవుడు మోచేతులమీద లేచి "కంట్లో కలంపెట్టి పొడిచిం దెవ రూ? ఏదీచూపు" అని అన్నాడు.

అన్నపూర్ణ నవ్వుతూ "ఇప్పటికింకా ఆపనిజరుగలేదు. ఇది అయితే గియితే మాట" అన్నది.

యాదవుడు స్థిమితంగా కూచుని "ఓ, అయితే గియితేమాటా! నే. నేమనుకున్నానంటే."

చాటున నుంచున్న బిందువాసిని లోలోపలనే ఉడికిపోయి మృదు స్వరం పెట్టి "అక్కయ్యగారూ! 'ఇది సృష్టిలో ఎక్కడా జరగని పని. నేను చెప్పనైనా చెప్పలేను' అని అంటూ మళ్లా చెప్పడాని కెందుకొచ్చారు?" అని అన్నది.

తాను చెప్పుతూన్న తరహా బాగుండలేదనిన్నీ, దానివల్లకలిగే ఫలితం కూడా మధురంగా వుండదనిన్నీ అన్నపూర్ణకూడా గ్రహించింది. ఇప్పుడీ తోడికోడలిల్లా బిగబట్టి మాట్లాడే మాటలలో దాగిఉన్న అర్థం స్పష్టంగా కనిపెట్టి అన్నపూర్ణ నిక్కంగానే భయబడ్డది. ఆవిడకోపం ఇప్పుడు ఏమీ తెలియని ఈమగని మీదనే విరుచుకు పడ్డది. ఆవిడె తనమగనినే ఉద్దేశించి "నల్లమందు నిషాతో కళ్లంటే మూసుకుపోతాయ్‌గాని చెవులుగూడా మూసు. కుపోతయ్యా? నేను చెప్పిందేమిటి. మీరు విన్నదేమిటి? 'కంట్లో కలం పెట్టి, పొడిచిందెవరూ? ఏదీ చూపూ ? అనా? అనంతం కళ్లైవరో పొడిచేశారని నే నన్నానా? అలదరిదోషాలూ నేనే మొయ్యాలి" అని అన్నది.

నిర్విరోధియైన యాదవుని నిషాకళలు అంతరించటం మొదలు పెట్టెయ్. అతడు వెలా తెలాపోయి "ఏమిటి, ఏమి జరిగింది?" అని అన్నాడు.

అనపూర్ణ కోపంతో "మరేం జరగలేదు. అంతా బాగానే వుంది. ఇటువంటి మనుషులతో మాటాడడం నాదే తప్పు నాతప్పు నేనే మొయ్యాలి" అని అగదిలోంచి అవలికి వెళ్ళిపోయింది.

"ఏమిటమ్మా ! ఆ సంగతంతావిస్పష్టంగాచెప్పు" అని యాదవుడడిగాడు.

బిందు తలుపుల నడుమ నిలబడి "ఎదురుగా మన కొట్టుపక్క బడి. పెట్టిస్తే—" అని మెల్లమెల్లగా అన్నది.

"ఇదేమంత పెద్దపనిటమ్మా ? అయితే చదువెవరు చెప్తారు ?"

"పంతులుగారిక్కడనే ఉన్నారు. నెలకు పదిరూపాయలిస్తే ఇక్కడే బడి పెడతామంటున్నారు. నాడబ్బుమీద వచ్చే వడ్డీలో కొంతతీసి యిస్తే సరిపోతుందనుకుంటా."

యాదవుడు తృప్తిపడి—"సరిపోకేం సరిపోతుంది. నేను రేపే మనుషులను పెట్టి బడి యేర్పాటంతా చేయిస్తా. గంగరామయ్యగారు ఇక్కడికే బడి మారిస్తే బాగా వుంటుంది" అని అన్నాడు.

యాదవు డొప్పుకోంగానే బిందువాసినికి కోపమంతా తుడుచుకుపోయింది. ఆమె నవ్వుతూ వంటింట్లోకి వెళ్ళింది. అక్కడ అన్నపూర్ణ మొహం ముబ్బించుకు కూర్చుంది. కదంబ దగ్గరగా కూచుని చేతులు తిప్పుతూ ఏదో వ్యాఖ్యానం చేస్తూంది. బిందువాసిని వంటింట్లోకి వచ్చే రావడంతోనే 'ఓయమ్మో' అని బెదిరిపోయి తాను చెప్పదలచుకున్నదంతా ఆ ఒక్క మాటతోటే ముగింపుకు తెచ్చింది. తన సంగతే నన్గ్రహించి బిందువాసిని కొంచెం దగ్గరగా వచ్చి— "ఏమిటది కొంచెం చెబుదూ" అని అన్నది.

కదంబగొంతుక భయంతో బిగుసుకపోయింది. అది " ఎబ్బే,... ఏమీ లేదు,... అమ్మ గోరు, ఉఁ, ఉఁ," అని గుటకలు మింగింది.

"నీసంగతి నాకు తెలిసింది లే. సరే, నీపని నీవు చేసుకో పో" అని బిందువాసిని కఠోరంగా అన్నది

కదంబ మరి మాటాడక అక్కణ్ణించి వెళ్ళిపోయి ప్రాణాపాయం తప్పించుకుంది.

అటుతరువాత బిందువాసిని అన్నపూర్ణను చూచి— "ఇంటి యజమానురాలికి బలేసలహాదార్లు దొరికారు. బావగారికి మనవిచేసి వీళ్ళకు జీతాలు ఎక్కువ చేయిస్తే బావుండేట్టుంది." అని అన్నది. బిందువాసిని కులాసాగా గనుక ఉంటే అన్నపూర్ణను అక్క అనిన్నీ, కోపంగా గనుక ఉంటే యజమానురాలనిన్నీ అంటుంది.

అన్నపూర్ణ మండిపడి "అలాగ్గే చేయరాదూ పోయి? ఆయన నాతల తీస్తారు. కావున్న మహా! ఆయనగారూ సరే. ఏమిటమ్మా!' 'ఆఁహాఁ' 'అదా' 'బాగువుంది' 'ఆలాగేనమ్మా' అని అరంభిస్తారు. డూడూ బసవన్నా అంటే డూడూ బసవన్నా! నే నదృష్టవంతుల నెందరినో చూచానుగాని వాళ్లైవళ్లూ నీకాలిగోటికైనా కూడా పోలరు. నీ వేదో గొప్ప నోము నోచుకుని పుట్టావ్. నిన్ను చూస్తే ఇంటిల్లి పాదికీ గడగడాట్" అని అన్నది.

బిందుకు కోపం వచ్చిందికాని అన్నపూర్ణ మాటాడిన ధోరణికి నవ్వేసి —"అదేమిటమ్మా? ఇంటిల్లిపాదికీ అంత గడగడాట్టయితే నీవు భయపడుతున్నట్లేమీ కనబడదే" అని అన్నది.

"ఇంకా భయపడక్క పోవడమా? నీరణచండీ రూపంచూచి గుండెలలో రక్తమంతా నీరుగామరని వాళ్లింటూ ఇంతవఱకు పుట్టలేదు కాని ఇంత కోపం పనికి రాదమ్మా చెల్లీ. నీ వింకా పసుబాపవు కావు పిల్లలను కనడం మొదలేస్తే ఈపాటికి నలుగు రైదుగురు పిల్లల తలపై కూచునేదానవు. అయినా నిన్నని ఏమిలాభం? ఆముసలాయిన గారాబం చేసి నిన్ను పాడుచేశారు" అని అన్నపూర్ణ అన్నది.

"నీ వేదో గొప్ప నోము నోచుకుని పుట్టావన్నారే అది నిజం. డబ్బూ దస్కమూ, గారమూ బీరమూ చాలమందికి దొరుకుతుందిగాని దేవుడులాంటి ఈబావగారు దొరకడానికి ఏదో నోము నోచుకొని పుట్టాలి సుమండి! నాఅదృష్టానికి మీరేమనుకుంటే ఏం లాభం అక్కగారూ? కాని వినండి! గారాబం చేసి ఆయనగారు నన్ను పాడు చేయలేదు. గారాబం గనుక చేసి ఎవరయినా పాడుచేసేవారుంటే అల్లవారు తమరు" అని బిందువాసిని అన్నది.

అన్నపూర్ణ చేతులు తిప్పుతూ "నేనా? ఎవ్వరూ అనరు. నాది సుగ్రీవాజ్ఞ. అయితే ఏంచేసేది? నాకదృష్టం పట్టలేదు. ఎవరూ నాకుభయపడరు.

దాసీదానిదగ్గర్నుంచీ అందరూ నాతో పోట్లాడుతారు; వాళ్లు దొరసాను లైనట్టూ, నేను దాసీదానైనట్టూ నేను కాబట్టి ఓర్చుకుంటున్నానుగాని ఇంకోళ్లయితే—" అని అన్నది.

బిందువాసినికి నవ్వు వచ్చింది. ఆమె నవ్వి అక్కగారూ! మీరు కృత యుగంలో పుట్టవలసినవారు కాని ఈ కాలంలో పుట్టవలసినవారు కారు. సరే కాని, నాతో మాత్రం ఎవరూ పోట్లాడరూ?" అని గబాలున ఎదుటికి వచ్చి మోకారించి అన్నపూర్ణమెడ రెండుచేతులతోనూ పెనవేసి—"ఏదయినా కథ ఒకటి చెప్పం డక్కగారూ" అని అన్నది.

అన్నపూర్ణ కోపంతో—'చాల్ చాల్లే! నన్నొదిలి పెట్టు" అని అన్నది.

కదంబ పరుగెత్తుకొచ్చి—"అమ్మగోరండీ. అబ్బాయిగారు అడపంతో వేలు కోసుకుని ఏడుత్తున్నారండీ" అని అన్నది.

బిందువాసిని అన్నపూర్ణమీద వేసిన చేతులు తీసేసి నిలబడి "అడపం ఎక్కడ దాపరించింది? మీరందరూ ఏ మేదుస్తున్నారు?" అని అన్నది.

"అబ్బాయిగోరు పెద్దమ్మగోరి గదిలోకి వెళ్లారు కామోసు. ఆసంగతి నేనెరగ' నేనప్పుడు ఆతల గదిలో పక్క వేస్తున్నాను" అని కదంబ చెప్పింది.

"ఆలాగా మంచిది, నీసంగతి తెలుసు" అని బిందు అక్కడినుంచి ఆవలకు వెళ్లి అనంతంవేలికి తడిపాత చుట్టి అతణ్ని ఎత్తుకుని మళ్లా అక్కడికి వచ్చి-"అక్కయ్యగారూ! ఎన్నిసార్లు చెప్పి పెట్టానండీ మీకు—'పిల్లలు తిరిగే చోట అడపాలూ గిడపాలూ జాగర్తా' అని. చెప్పేం ప్రయోజనం?" అని అన్నది.

అన్నపూర్ణ మరికాస్త మండిపడి—"నీవు చెప్పే మాటలకు తలాతోకా ఉండదు. కుర్రాడెప్పుడో వేలు కోసుకుంటాడని అడపాలినప్పెట్లో తాళం వేసుకునేదా?" అని అన్నది.

"అల్లాగయితే సరే, రేపటినుంచీ కుర్రాణ్ని తాళ్లతో కట్టిపారేస్తాను" అని అంటూ బిందువాసిని వెళ్లిపోయింది.

"కదంబా! విన్నావా! తోడికోడలుగారి బెదిరింపు! అడప మెవరైనా ఇనప్పెట్టెలో పెట్టి తాళం వేసుకుంటారా?" అని అన్నపూర్ణ అన్నది. కదంబ ఏమిటో చెప్పబోయి గొంతుక సవరించుకుని ఊరుకుంది. బిందు మళ్లా వచ్చి—"అక్కయ్యగారూ! మీరు మన కబుర్లన్నీ నౌకర్లకూ,చాకర్లకూ చెప్పు కుంటూ కూచుంటే—నిజంగా చెబుతున్నా వినండీ—నేను కుర్రాణ్ని తీసు కొని మా పుట్టింటికి వెళ్లిపోతా" అని అన్నది.

"వెళ్లిపోతే వెళ్లిపోరాదూ? మొఱ్ఱోమన్నా నిన్ను రమ్మంటే అప్పు డను!" అని అన్నపూర్ణ అన్నది.

"నేను వస్తేకదా" అని మొహం భారంజేసుకుని బిందువాసిని అక్కణ్నించి వెళ్లిపోయింది.

మరి రెండుగంటలు దాటాకా అన్నపూర్ణ నేల మోగిపోయేటట్టు అడుగులు తొక్కుతూ తోడికోడలి గదిలోకి వెళ్లింది. మాధవ్ డొక మూల ఒక చిన్నబల్లమీద ఉన్న బ్రీఫ్‌లు చూచుకుంటున్నాడు. మరొకమూల బిందు వాసిని మంచమ్మీద పడుకుని అనంతానికి కథ చెబుతూంది.

"అన్నం తిందుగాని రా" అని అన్నపూర్ణ అన్నది.

"ఆకలి లేదు"

అనంతం పింతల్లికంఠం గబుక్కున పట్టేసి—"మాఅమ్మ అన్నం తినదు; నీవు పో" అని అన్నాడు.

అన్నపూర్ణ "నీవు నోరుముయ్" అని కొడుకును కసరి. "ఈపిల్లడే అన్నింటికి మూలం. వీణ్ని గారాలకూచిని చేసేశావ్. చివరికి తెలుస్తుందిలే అప్పు డేడుస్తావ్. అక్కయ్య అన్నట్టే అయిందని అప్పు డనకపోతే చూడు" అని అన్నది.

బిందువాసిని అనంతం చెవిలో ఏమో ఊదగానే అతడు "సీ వెళ్లవే అక్కా! అమ్మ నాకు ఖచ్చేవ్తూంది" అని అన్నాడు.

అన్నపూర్ణ—"మేలుగనుక కావాలనుకుంటే లేచి రా. రాకపోతివా మిమ్మనిద్దర్నీ రేపొద్దున్నే తగి లెయ్యకపోతే నా పేరు అన్నపూర్ణ కాదు" అని ఉరిమి, ఎల్లా చప్పుడు చేసుకుంటూ వచ్చిందో అల్లాగే చప్పుడు చేసుకుంటూ వెళ్లింది.

"ఇవ్వేళ మళ్లా యేం పోసగింది?" అని మాధవు డడిగాడు.

"అక్కగారికి కోపం వస్తే ఎప్పుడూ ఏమి పోసగుతుందో అదే పోస గింది. ఇది పిల్లాడు తిరిగే కొంప. అడపాలూ గిడపాలూ కొంచెం జాగ్రత్తగా పెట్టుకోవాలి' అని నేనన్నా. ఇందుకు ఇంత గ్రంథం జరిగింది" అని బిందు వాసిని అన్నది.

"సరేకాని, మరి మాటాడక వెళ్లు. ఆమె ఎల్లా వెళుతూందో గమనిం చావా? అన్నయ్య ఇక లేస్తారు" అని మాధవు డన్నాడు.

బిందువాసిని అనంతాన్ని ఎత్తుకుని నగుమొగంతో వంటింట్లోకి వెళ్లింది.

---

# 3

ఇద్దరు బిడ్డ లోకతల్లి నాశ్రయించుకొని పెరిగినట్లు ఈయిద్దరు తల్లులూ ఈ ఒకబిడ్డ నాశ్రయించుకొని ఆరేండ్లు కాలక్షేపంచేశారు. అనంతుడు కొంచెం పెద్దవాడయాడు. ఎంట్రెన్సుస్కూల్లో రెండోక్లాసు చదువుతున్నాడు. ప్రైవేట్ చెప్పడానికింట్లో పంతులును పెట్టారు. ఆయన పొద్దుటి పూట పాఠాలు చెప్పి వెళ్లాక అనంతం ఆడుకోవడానికి వెళ్లాడు. నేడు ఆదివారం. బడి లేదు.

అన్నపూర్ణ బిందువాసినిగదిలోకి వచ్చి, "ఏం చేయనమ్మా చెల్లీ' కొంచెం చెబుదూ" అని అన్నది.

బిందువాసిని అలమర తెరిచి బట్ట లన్నీ కిందపడేసి ఆ గుట్టలోంచి అనంతం తొడుక్కోడానికీ దుస్తు లేరుతూంది. చాలా డబ్బు గల ఒక క్లయింటు తన భర్తను విందుకు పిలిచాడు. ఆయనతోకూడా అనంతాన్ని విందుకు పంపాలి. ఈ తొందరలో బిందు కళ్లెత్తి చూడకుండానే-"ఏమిటది?" అని అన్నది.

బిందువాసినివైఖరి ప్రసన్నంగా లేదు. కిందపడివున్న నానారకాల దుస్తుల గుట్టను చూచి విస్తుపోవడంవల్ల అన్నపూర్ణ తోడికోడలి వైఖరి గ్రహించలేదు. ఆమె ఈలా కొంచెంసేపు నిశ్శబ్దంగా చూచి, "ఈదుస్తు లన్నీ అనంతంవేనా యేమిటి" అని అన్నది.

"ఔను"

"నీ వెంత డబ్బయినా పాడుజేసేస్తున్నావమ్మా! ఇందులో ఒకొక్కదానివెల ఒకొక్క పేదపిల్లాడి కేడాదిపొడుగునా గుడ్డలకు సరిపోతుంది"

బిందువాసినికి విరక్తి కలిగింది. అయినా మామూలుధోరణిలోనే ఇల్లా

అంది: "సరిపోతే సరిపోవచ్చు, కాని భాగ్యవంతులకూ, భాగ్యహీనులకూ తేడా ఉండనే ఉంటుంది, అందుకోసం మనం దుఃఖిస్తే ఏంలాభం?"

"మహా భాగ్యవంతుడైనాడు లే! నీవు చేసే ప్రతిదాంట్లోనూ అతి—"

బిందువాసిని కొంచెం మొహం మెత్తి, "ఏదో చెప్పడాని కొచ్చారు. అది చెప్పి పోరాదుటండీ: నా కిప్పుడు తీరికగా లేదు" అని అన్నది.

"నీకు తీరి కెప్పుడు?" అని అన్నపూర్ణ కోపంతో వెళ్ళిపోయింది.

అనంతాన్ని పిలుచుకురాబోయిన భైరవుడు గంట గంటన్నర వెతికి తుద కతణ్ణి తీసుకొచ్చాడు.

"ఇంతసేపటినుంచీ ఎక్కడున్నావ్" అని బిందు అడిగింది. అనంతం మాటాడక నుంచున్నాడు.

"ఆ పేటలో సంసారుల పిల్లలతో కలిసి కుండబంతి ఆడుతున్నాడు" అని భైరవుడు రహస్యం బైలుపెట్టాడు.

ఈయాటంటే బిందుకు భయం. అందువల్ల కుండబంతాట ఎప్పుడూ ఆడవద్దని ఆమె అనంతుణ్ణి అదుపు చేస్తూవుంటుంది.

"కుండబంతి ఆడద్దని నీకు చెప్పలా" అని బిందు అన్నది.

"నేనెక్కడ నుంచున్నాను. వాళ్ళు చేయుంచ్చుకు లాగి—" అని చెబుతూ చెబుతున్న అనంతమ్మొహం నల్లబడ్డది.

"చెయ్యిచ్చుకు లాగా...నిన్ను? సరే. మంచిది. కాని ఇప్పుడు భోజనానికి వెళ్ళు, వచ్చాక దానిసంగతి చెప్తా.

రెన్నెల్లక్రితం అనంతానికి పసు గయింది. బోడి తలమీద జరీటోపి పెట్టు కోవడ మంటే అతనికి చాలా భయం. చచ్చినా ఎవరినీ పెట్టనిచ్చేవాడు కాదు. అయితే బిందువాసిని వదిలిపెట్టేరకమా? ఆమె బలవంతంగా పెట్టనే పెట్టింది. అనంతం ఏడవడం మొదలుపెట్టాడు. మాధవుడు గదిలోకి వస్తూనే "ఇంకా ఎంత ఆలస్యం?" అని అనంతం కనబడీకనబడడంతోటే "బతే బతే

మధురలో శ్రీకృష్ణులవారు దిగివచ్చారు" అని అన్నాడు. అనంతం సిగ్గుపడి టోపీ ఆతల గిరాటేసి మంచమ్మీద కుప్పన కూలబడ్డాడు. బిందు కోపగించి "పిల్లా దసలే యేడుస్తున్నాడు. అది చాలనట్లు మీరు—"

మాధవుడు గంభీరంగా ఇల్లా అన్నాడు: "ఏడవ కనంతా ! లే ? లోకులు పిచ్చివా డంటే నన్నంటారుగాని నీవు లేచిరా"

ఇంతకు ముం దొకనాడు సరిగా ఈమాటే వచ్చింది. దానివల్ల బిందు చిందులు తొక్కింది, ఇప్పుడుమళ్ళా ఆ గాయమ్మీద కారం పడటంవల్ల మరీ మండిపోయి "నాపను లన్నీ పిచ్చిపనులు కావూ ?" అని లేచి అనంతాన్ని తీసుకొచ్చి విసన కర్రతో రెండంటించి; అతనికి తొడిగిన మొఖ్ మల్ లాగులూ, చొక్కాలూ ఒక్కటొక్కటే ఊడబెరకడం మొదలుపెట్టింది.

మాధవుడు భయంతో వెలుపలికి వచ్చి వదినెగారిని చూచి "దానికి దయ్యం పట్టినట్లుంది. మీరోసారి అల్లా వెళ్ళండి" అని అన్నాడు.

అన్న పూర్ణ లోనికి వెళ్ళి బిందువాసిని లోగడ తొడిగిన చొక్కాలూ, లాగులూ తీసివేసి మామూలు బట్టలు కట్టడమూ, అనంతం తెల్లబోవడమూ. ఇదంతా చూచి "విప్పేశా వేవమ్మా ?" అని అన్నది.

బిందువాసిని అనంతాన్ని వదిలేసి మెడకు కొంగుచుట్టుకొని మోకారించి చేతులు జోడించి అక్కయ్యగారూ ! మీ కాళ్ళమీద పడతాగాని మీ రిక్కడనుంచి వెళ్ళిపొండి, మీ "అందరి మాధ్యస్థ్యంవల్లా కుర్రాడునలిగిపోతున్నాడు" అని అన్నది.

అన్నపూర్ణ మరి మాటాడలేక నిలబడిపోయింది.

బిందువాసిని అనంతం చెవులుచ్చుగుని లాక్కొచ్చి ఒకమూల నిలేసి "నీవు మంచివాడివి కావ్ తగిన శాస్తి అనుభవించు, రోజల్లా ఇక్కడవుండు. అక్కగారూ మీ రీవలికి వచ్చేయండి, నే నిహా తలుపు వేసేస్తా" అని అన్నపూర్ణతో వెలుపలికి వచ్చి తలుపుమూసి బయట గొళ్ళెం పెట్టింది.

ఒంటిగంట కావచ్చింది. అన్నపూర్ణ ఓర్వలేక "వాణ్ణి ఇవ్వేళ అన్నం తిన్నీయవా? వాడికోసం ఇంటిల్లిపాదీ ఉపోషం పడుకోవాలిసొస్తుంది" అని అన్నది.

"పడుకుంటే పడుకోనీండి! వాళ్ళ యిష్టం" అని బిందు అన్నది.

"అదేమి మాటమ్మా చెల్లీ? ఇంట్లో ఒక్కటేకుర్రాడు! వాడన్నం తిన కుండాఉంటే. నీమాటా నామాటా అతల ఉంచు. నౌకర్లూ చాకర్లూ ఎల్లా తింటారో చెప్పు"

"నాకదంతా ఏమీ తెలియదు"

ఇహా తర్కిస్తే లాభం లే దనుకొని అన్నపూర్ణ "నే చెపుతున్నావిను! అక్కమాట తీసెయ్యకు! నేటికి వాణ్ణి క్షమించు! వాడికి జబ్బుగనుక చేస్తే నీవే అఘోరిస్తూ కూర్చుంటావు" అని అన్నది.

పొద్దు పోవడం చూచి బిందువాసిని స్వయంగానే తగ్గుకుంటూ వస్తూంది. ఇప్పుడు కదంబను పిలిచి "తీసుకురా వాణ్ణిల్లా" అని, "ఇదిగో అక్కయ్యగారు! మీకూ ఇదే చెప్పడం, నాపనిపాటలలో గనుక కల్పించు కుంటే ఇహా బావుండదు" అని అన్నది.

ఆనాటికి ఆ గందరగోళం అంతటితో ఆగిపోయింది.

తమ్ముడికి క్లయింట్లు ఎక్కువమంది రావడం మొదలేసిన తరువాత యాదవు డుద్యోగం వొదిలేసి తమ సొంత ఆస్తిపాస్తులు చూచుకోవడం ఆరంభించాడు. మరదలు తీసుకొచ్చిన పదివేలూ వడ్డీకివేసి ఇంచుమించు రెట్టింపు చేశాడు. ఈ డబ్బులో కొంతా, మాధవుని ఉపార్జనలో కొంతా పెట్టి ఒక పెద్దరకపు ఇల్లు కట్టించాడు. ఆ యిల్లు ఈయింటికి కొక అరమైలు దూరం. అది తయారై పదిరోజులయింది. మంచిరోజు చూచుకొని అందులో ప్రవేశించాలని సంకల్పం. కాబట్టి యాదవుడొకనాడు దన్నమ్ముందు కూచుని, మరదలి నుద్దేశించి "నీయిల్లు తయా రయిందమ్మా! ఇంకేమయినా చేయవలసిందుందేమో ఒకనాడు చూచుకో రా" అన్నాడు.

బావగారు భోజనం చేస్తూవుంటే తన కెన్ని పనులున్నా మానుకుని తలుపుచాటున కూచోడం బిందువాసిని కలవాటు. ఆమెకు దేవునిమీద ఎంత భక్తో బావగారిమీద అంతభక్తి, ఈమెకేగాక ఇంటిల్లిపాదికీ ఆయనమీద అంతభక్తీ వుంది.

తలుపుచాటున కూచున్న బిందువాసిని "ఇంకేమీ చేయవలసింది లేదు" అని అన్నది.

యాదవుడు నవ్వి—"మాడకుండానే తీర్పుటమ్మా? సరే, మంచిది కాని, మరోమాట. మన బంధువుల నందరినీ పిలుచుకు వెళ్లి మంచిరోజు చూచుకుని అక్కడ ప్రవేశించి గృహదేవతలను పూజించాలని వుంది. ఏమంటావమ్మా" అని అన్నాడు.

"అక్కగారితో చెప్తాను, ఆమెయిష్టానుసారం జరుగుతుంది"

"మంచిది. అలాగేకానీ, అయితే మాసంసారానికి నీవే లక్ష్మివి! నీ యిష్టానుసారమే యీ యింట్లో పని జరుగుతుంది."

దాపుననే వున్న అన్నపూర్ణ నవ్వి "మీలక్ష్మి కొంచెం శాంతం చిత్త గిస్తేనే పనులు జరుగుతాయ్" అని అంది.

యాదవుడు "శాంత మేమిటి శాంతం? మా అమ్మ జగద్ధాత్రి, ఆమె దయవొస్తే వరమూ ఇస్తుంది; అక్కరపడితే కత్తీ పడుతుంది, నాకిలాఉండ డమేయిష్టం. మాఅమ్మ నిక్కడకు తీసుకుని వచ్చాక సంసారములో కష్టమనే మాట లేకండాపోయింది" అని అన్నాడు.

"మీరన్నమాట నిజం. ఆవిడె ఇక్కడికి రాకముందు మన దినా లెల్ల గడిచాయో తలుచుకుంటేనే భయం వేస్తుంది" అని అన్నపూర్ణ అన్నది.

బిందుకు సిగ్గొచ్చింది. ఆమె యీ మాటలు తొక్కిపట్టి "మీరు అందరినీ పిలవండి, ఆయిల్లు చాలా పెద్దది. అందులో ఎంతమందయినా ఉం డచ్చు. వారికిష్టంవస్తే ఐదారు నెలలపాటు ఉండచ్చు, ఎవరికీ కష్టం లేకుండా, అని అన్నది.

"అలాగేనమ్మా, రేపే వారి నందరిని పిలవ నంపుతాను" అని యాదవు డన్నాడు.

---

# ៨

వేణమ్మ వీరికి దగ్గిరచుట్టం. ఆమె సంసారం ఏమంత బాగాలేదు. యాదవుడికి ఈసంగతి తెలిసి వారికి సాయంచేస్తున్నాడు. ఆమెకొడుక్కి చదువు చెప్పిదామనుకుని వాళ్ళ నందరినీ రమ్మని కొన్నాళ్ళనుంచీ ఉత్తరాలు రాస్తున్నాడు. ఇప్పుడామె కొడుకును వెంటబెట్టుకొని ఇక్కడికి వచ్చింది. ఆమె మగని పేరు పేరిశాస్త్రుల్లు. ఆయన ఏమిపని చేస్తాడో యేమో యెవరికీ సరీగా తెలియదు. రెండుమూన్నాళ్ళల్లో ఆయనకూడా దిగాడు యాదవుడు చదువు చెప్పించదలచుకున్నది వీరి కొడుకు నరహరికి. అతడికి పదహారు పదిహేడు ఏళ్లు ఉంటై. అతడు పెడల్పాటి అంచుల ధోతీలు కటతాడు. రోజుకు పది పన్నెండు సార్లయినా తల దువ్వతాడు. అతడు పాపిడి తీయడం చూచితీరవలసిందే.

ఇపుడు వారందరూ వంటింటివసారాలో కూచున్నారు. వేణమ్మగారు తన కొడుకు తాలూకు అసాధారణమయిన రూపాన్నీ, గుణాలనూ తెలియ జెపుతూంది.

“నరహరీ! నీ వేక్లాసు చదువుకున్నావ్?” అని బిందు అడిగింది.

“ఫోర్తుక్లాసు. రాయల్ రీడర్, గ్రామర్, జియోగ్రఫీ, ఎరిత్ మెటిక్, డెసిమల్. గెసిమల్—ఇంకా ఇలాటివెన్నో ఉన్నాయ్, అవన్నీ నీ కేం తెలుస్తుందమ్మా అత్తా!” అని నరహరి అన్నాడు.

కొడుకుమోహం సగర్వంగా ఒకసారి చూచి వేణమ్మగారు బిందువాసినితో “ఒక పుస్తకమూ అరపుస్తకమూనూటమ్మా? అవన్నీ కలిపితే బండెడు” అని, తరువాత తన కొడుకును చూచి “రేపు అవన్నీ మీ అత్తలకొకసారి చూపునాయనా” అని అన్నది.

నరహరి తల తిప్పి—"ఓ, అలాగే చూపుతా" అని అన్నాడు.

"ఇత నింకా ఫోర్తుకాసు. నే కూచున్నాడేం?" అని బిందు అన్నది.

"కూచునేవాడమ్మా? ఈపాటికి ఒకటికాదు నాలుగు ప్యాసయేవాడు. ఆపాడు పంతు లొకడు దొరికాడు—వాడికడుపుడక వాడికి మాఅబ్బాయి మీద ఎందుకోకోపమో వాడికే తెలియాలి. వాడిదుంపతెగ—పీణ్ణి పైక్లాసులోకి పోని స్తినా? వాడికెందుకో ఇంత కడుపుమంట! ఏటేటా ఒక్కక్లాసులోనే కూలేస్తున్నాడు" అని వేణమ్మ అన్నది.

బిందు ఆశ్చర్యపడి "అదేమిటమ్మా. అటువంటి దెన్నడూ జరగదు అని అన్నది.

"ఒకమూల జరుగుతూంటే మళ్ళా జరగదంటా వేమిటి? ఆ పంతుళ్ళందరూ వొక్కటి. అందరూ లంచాలు మరిగారు. మే మేమీ లేనివాళ్ళంగదా, వాళ్ళకు లంచం పెట్టటానికి మాకు డబ్బెక్కణ్ణించి వస్తుందో చెప్పండీ" అని వేణమ్మ అన్నది.

బిందు విని ఊరుకుంది. అన్నపూర్ణ నిజంగానే విషాదపడి, మనుష్యుల్ని ఇల్లా బాధించడం మంచిపని కాదు. మాకుమాత్రం ఇలాటి బాధలేదు. మా అనంతం ప్రతియేడూ ప్రైజులు తెస్తాడు. అందుకు మే మేమీ లంచా లీయ నక్కరలేదు" అని అన్నది.

ఈసమయంలో అనంతం ఎక్కణ్ణుంచో వచ్చి మెల్లమెల్లగా బిందు వాసిని ఒడిలో పడ్డాడు. పడేపడటం తోటే ఆమె కంఠం పెనేసి చెవిలో "రేపు ఆదివారం. ఇవ్వాళ పంతులుగారిని వెళ్ళిపోమ్మని చెప్పవూ?" అని ఊదాడు.

బిందువాసిని నవ్వి "చూచారండీ వేణమ్మగారూ! వీడు మాటలంటే చెవులు కోసుకుంటాడు. ఒనే కదంబా! అబ్బాయి ఇవ్వేళ చదువుకోడుగాని పంతులు గారిని వెళ్ళమని చెప్పు!" అని అన్నది.

నరహరి ఆశ్చర్యపడి "ఏరో అనంతం! ఇంత పెద్దవాడ వయావ్? ఇంకా ఆడాళ్ళ వొళ్ళో కూచుంటారా?" అని అన్నాడు.

బిందు నవ్వి "ఇంతే ననుకున్నావా యేమిటి అబ్బాయి ప్రయోజకత్వం! ఇప్పటికి రాత్రి—" అని అన్నది.

అనంతం గడబిడపడి ఆమెనోటికి తన చేయితాళంపెట్టి "అమ్మా చెప్పకే" అని అన్నాడు. బిందు ఏమీ చెప్పలేదుకాని అన్నపూర్ణ అందుకుని, "ఇప్పటికీ అబ్బాయి రాత్రిళ్లు పింతల్లిపక్కలో పడుకుంటాడు" అని కలిపింది.

"ఊరికే పడుకోడమేనటమ్మా? రాత్రల్లా గబ్బిలంలాగా అంటిపెట్టుకు నిద్దరోతాడు" అని బిందు పూరించింది.

అనంతం తల తీసుకుపోయి పినతల్లివక్షంలో దాచుకున్నాడు.

"ఛీఛీ! ఇదేమిటిరోయ్? నీవు నిజంగా ఇంగ్లీషు చదువుతున్నావా?" అని నరహరి అన్నాడు.

"చదవకేం? బళ్లో ఇంగ్లీషే చదువుతాడు" అని అన్నపూర్ణ అన్నది.

"ఇంగ్లీసు చదువుతాడూ ఇంగ్లీసు? ఏదీ—ఎంజిన్, దీనికి స్పెల్లింగ్ చెప్పమను. వాడితరం గాదు" అని నరహరి అన్నాడు.

"ఓ, అది గొట్టుమాట. కుర్రాళ్లటుమంటివి చెప్పలేరు" అని వేణమ్మ అన్నది.

"ఏదీ చెప్పరా. ఎందుకు చెప్పలేవో చూదాం" అని అన్నపూర్ణ అన్నది.

అనంతంమాత్రం నోరు తెరవలేదు.

అనంతంతల వక్షానికి అదిమిపట్టుకుని బిందువాసిని "మీరు నలుగురూ నాలుగు మాటలూ అంటూవుంటే మాఅబ్బా యెల్లా చెప్పగలుగుతాడూ?" అని, పిమ్మట వేణమ్మను చూచి "మావాడు వచ్చే పరీక్ష ప్యాసవుతాడనీ, ఇరవై రూపాయలుస్కాలర్‌షిప్ వస్తుందనీ పంతులుగారు చెప్పారు. ఆయిరవై పెట్టి మా అబ్బా యోగుర్రం కొంటాడు పింతండ్రిగారికి మల్లే" అని అన్నది.

ఈమాటలు నిజమైనప్పటికీ అందరూ పరిహాసంగా తీసుకుని నవ్వడం మొదలు పెట్టారు.

"ఇదుగో బిందమ్మగారూ! మానరహరి చదువు సంరక్షుల్లోనే ఘటకుడని అనుకుంటున్నారేమో! నాటకాలలో వేషాలు వేశాడురా అంటే చూచేవాళ్లకు కళ్లన్నీళ్లాగవ్. సీతామ్మవారి వేషంవేసి నీవు చెప్పేపార్టు మీ అత్తలకోసారి వినిపించు నాయనా?" అని వేణమ్మ అన్నది.

నరహరి వెంటనే మోకారించి, చేతులు జోడించి, అనునాసిక స్వరం పెట్టి, "హా ప్రాణేశ్వరా! ఏ విషఘటికలలో నీ యీ చరణదాసి—" అని అందుకున్నాడు.

బింకు కలవెలపడి "ఆ గాగు. బావగారు పైనున్నారు" అని అన్నది.

నరహరి బెదిరి సంగీతం ఆపుచేసి ఊరుకున్నాడు.

విన్న కాసిని ముక్కలకే వింతపడి అన్నపూర్ణ "ఏంలేమాత్రమేమమ్మా? ఇవేమయినా పాడుకూతలు గనుకనా? దేవతాకథలు" అని అన్నది.

ఈ మాటలకు తుష్టి లేక బిందువాసిని "ఏంటే దేవతాకథలు మీరు వినండి; మేం వెళ్లిపోతాం" అని అన్నది.

"పోనీకాని, సావిత్రిపార్టు చెబుతా నుండవమ్మా అత్తా!" అని నరహరి అన్నాడు.

"వద్దు" అని బిందు అన్నది.

ఈకంఠస్వరం అన్నపూర్ణ బాగావింది. విని ఈవ్యాపారం చాలా దూరం నడిచిందనిన్నీ, ఇది ఇంతటితోనే ఆగిపోదనిన్నీ ఇప్పటికి గ్రహించింది. వేణమ్మ కొత్తమనిషి. ఇక్కడిస్థితిగతు లేవీఆమెకు తెలియవు. కాబట్టి ఆమె "ఒరేనాయనా మగవాళ్లింట్లో లేనప్పు డవన్నీ చెబుదుగాన్లే" అని, సభవారి వంకకు తిరిగి "మావాడు సంగీతం పాడడంలోనూ, మద్దెల వాయించడంలోనూ ఏమంత తక్కువతిన్నాడనుకున్నారేమో! అదుందే అది, ఆ

దమయంతి దుఃఖించే పాట. ఎంతుం దనుకున్నారు. అబ్బో! అ దోసారి అను నాయనా! అది గనుక వింటే వీరందరూ వదలిపెడతారేమో చూదాం" అని అన్నది.

"ఇప్పుడు పాడేసెయ్యనా?" అని నరహరి అన్నాడు.

కోపంచేత బిందువాసిని ఒళ్లు మండిపోతూంది, అంచేత ఆమె యేమీ మాటాడక కూచుంది.

"వొద్దొద్దు, ఇప్పుడు పాట యేమీపాడద్దు" అనిఅన్నపూర్ణ గబగబా అన్నది.

"సరేకాని. నేనీపాటలన్నీ అనంతానికి నేర్పుతా. నేను మద్దెలకూడా వాయించగలను. తకతా తకతా అనే వరసుందే అది వాయించడం చాలా కష్టవమ్మా అత్తా? అదిగో ఆ రాగిబిందె ఇల్లా అందియ్. వాయించి చూపెడతా" అని నరహరి అన్నాడు.

బిందువాసిని 'లె' మ్మని సైగచేసి అనంతా, ఇంట్లోకి పోదాం లే' అని అన్నది.

మైమరచి వింటున్న అనంతుడికి లేవాలని లేదు 'ఇంకొంచెం సేపు కూచుందామే అమ్మా' అని అతడు మెల్లమెల్లగా అన్నాడు. బిందువాసిని మఱి మాటాడక అనంతుణ్ణి లేవదీసి వెంటబెట్టుకుని తన గదిలోకి వెళ్లి పోయింది.

నరహరి సాహచర్యంవల్ల అనంతం చెడిపోతాడనీ, నరహరి ఇక్కడే వుండి చదువుకోవడం బిందు కిష్టంలేదనీ అన్నపూర్ణ గ్రహించి ఉద్వేగం పొంది "నాయనా నరహరీ! నీ ఈ సంగీతాలూ సాహిత్యాలూ నీచిన్నత్త ముందు ఇకముం దెప్పుడూ విప్పకు; ఆవిడె కిటువంటి వేవీ గిట్టవు" అన్నది.

"ఓహో! ఆమె కిటువంటి వేమీ బాగుండవేం ? ఆఁహాఁ ! అందుకనా అలా వెళ్ళింది" అని వేణమ్మ ఆశ్చర్యపడ్డది.

"ఆమెకు బాగుండక పోవచ్చు సరేకాని, మరోమాట నరహరీ! నీవు మీ అమ్మగారి కష్టాలన్నీ గట్టెక్కేట్లు సంచరించు నాయనా! నీచదువేమిటో నీసం ర్భమేమిటో అంతేకాని అనంతంతో అతిగా కలిసిమెలిసి తిరగకు! వాడు కుర్రాడు; నీకన్న చాలాచిన్న" అని అన్నపూర్ణ మళ్ళా అన్నది.

వేణమ్మ కీమాట లేమీ రుచింపలేదు. "అన్నపూర్ణమ్మగారూ! మానర హరి పేదవాళ్ళ పిల్లాడే, అందుకు సందేహం లేదు. పేదవాళ్ళ పిల్లాడు పేద వాళ్ళ పిల్లాడి లాగానే ఉండాలి, అందుకున్నూ సందేహంలేదు. అయితే ఏమాటకామాటే చెప్పాలి అన్నపూర్ణమ్మగారూ! అయితే మీవాడు పసి గుడ్డూనూ, మావాడు మూడుకాళ్ల ముసిలీ నీటండీ? ఒక యేడూ అరయేడూ చిన్నైతే అదోలెక్కటండీ? అయితే మావా డెన్నడూ గొప్పవాళ్ల నెరగ డనుకున్నారా? ఇక్కడే చూస్తున్నా డనుకుంటున్నారా? వాళ్ళ నాటకశంపై నీలాగోరాజులూ, రాచకోమాళ్లూ ఎంతమం దున్నారో మీ కేమన్నా తెలుసా?" అని అంది.

అన్నపూర్ణమ్మ పని అయింది, "ఎబ్బెబ్బెబ్బె! నేనల్లా అనలేదండీ, నా ఉద్దేశం..."

ఇంకా మీవుద్దేశ మేమిటండీ ? మేము ఎంత తెలివితక్కువవాళ్ళ మైనా ఈమాత్రం తెలుసుకోలేక పోమండీ. అన్నయ్య రమ్మనంటే వచ్చాం. కాని మేమక్కడ తిండికి లేకచచ్చిపోవడం లేదు." అనివేణమ్మ అన్నది.

అన్నపూర్ణకు చచ్చిన చావయింది. "నే నల్లా అనలేదు. దేవుడు మీ దొట్టు. బాగా చదువుకొని అమ్మను సుఖపెట్టు నాయనా" అని చెప్పానమ్మా.

వేణమ్మ 'మాంచిది మాంచిది' అని కొడుకుకేసి తిరిగి, "నాయనా! సరే కాని, నీవు వాకట్లో కూచో, గొప్పవారి పిల్లలతో కలిసిమెలిసి తిరగకు" అని నరహరిని తోసుకుంటూ అక్కడనుంచి వెళ్లిపోయింది.

అన్నపూర్ణ తుపానుమల్లే బిందుగదిలోకి వెళ్లి "మేం నీకోసం మా భాంధవ్యాలన్నీ తెంచుకోవలసివచ్చింది. కొత్తవాళ్లింటికి కొస్తే అల్లాగేనటమ్మా లేచిపోయి రావడమూ?" అని కన్నీరు కారుస్తూ గదగదమన్నది.

బిందువాసిని అతిసహజంగా ఇల్లా జవాబు చెప్పింది: "నాకోసం మీరు బాంధవ్యాలు తెంపుకోవడ మెందుకమ్మా? మీరూ; మీ బంధువులూ అందరూ సుఖంగా ఉండండి. నేనే నాప్రాణ్ని తీసుకొని పలాయనం చెబుతాను.",

"ఎక్కడికి పలాయనం చెబుతావో కొంచెం చెప్పి మరీ వెళ్లమ్మా."

"నేను వెళ్లేనాడు ఎక్కడికి వెడతానో ఆ ఊరూ పేరూ అన్నీ చెప్పే వెళతానుగాని అందుకోసం మీరు గడబిడ పడకండి."

"నలుగురి నోళ్లలోనూ పడెయ్యకుండా మాత్రం నీవు విడిచిపెట్టవని నాకు బాగా తెలుసు. ఇంట్లో అడుగు పెట్టింది మొదలూ నన్ను చంపుకుతింటున్నావ్" అని. వెళుతూ వెళుతూ అన్నపూర్ణ మాధవుడు రావడం చూచి, "లేదండీ మరదిగారూ! మీ రింకోచోటికి వెళ్లిపోయినాసరే, లేకపోతే ఈ విడను వొదిలేసినాసరే ఈవిడె ఈయింట్లోవుంటే నే నిహ ఇక్కడ కాపరం చెయ్యలేను" అని మరొకసారి మండిపడి అక్కడినుంచి వెళ్లిపోయింది.

మాధవు డాశ్చర్యపడి "ఏమిటీ సంగతి?" అని భార్యనడిగాడు.

"నాకేమి తెలియదు. మీ వొదినెగారు మీకు ఆర్డర్ వేసిందిగా, బస్ మమ్మన్ని వెళ్లగొట్టేసెయ్యండి" అని బిందువాసిని అన్నది.

మాధవుడు మరి మాటాడక టేబిల్ మీదవున్న వార్తాపత్రిక చేతబుచ్చుకుని వీధిగదిలోకి వెళ్లిపోయాడు.

---

౫

వేణమ్మ వెర్రి బాగులదానిలా కనబడుతుందిగాని అసలుకు ఆవిడె వెర్రి బాగుల్దికాదు. పిల్లా పీచూ ఏమీ లేని యీ బిందువాసిని బంగారుపిచ్చుక అని తెలిసినవెంటనే వేణమ్మకు బిందువాసినిమీద ఎక్కడాలేని ప్రేమ పుట్టుకో వచ్చింది. రోజూ రాత్రి పేరయ్య శాస్త్రులుదగ్గిరికి వెళ్లి "మీవల్లే నాకేమీ లేకుండా పోయింది. నేను వృధాగా మీదగ్గిర పడివుండక ఇక్కడనే గనుక ఉండినట్టయితే ఈపాటికి రాజమాతనై పోయేదాన్ని. చంద్రుళ్లా మన కుర్రాడుండగా బిందు ఆదయ్యప్పిల్లాణ్ని-" అని చివాట్లు పెట్టి ఒక దీర్ఘని శ్వాసంతో ఆదయ్యప్పిల్లాడి పరమాయుష్యం కాస్తా ఊదేసి "పేదవారికి దేముడే పెన్నిధి" అని ముగించి నిద్రపోయేది. పేరిశాస్త్రుల్లు లోలోపల తన తెలివితక్కువతనానికి చింతిస్తూ చింతిస్తూ నిద్రలోకి పోయేవాడు. ఈ రీతిగా ఆ దంపతులకు కాలం గడుస్తూంది. వేణమ్మకు బిందుమీద ప్రేమ కొండవాగు లాగు పొర్లుకొస్తూంది.

ఒకనాడు రెండుజాములవేళ వేణమ్మ బిందునుచూచి "నీతలకట్టు కారుమబ్బుల్లే వుంటుంది. ఏనాడూ దువ్వుకున్నట్టుగానీ, జడేసుకున్నట్టుగానీ కనపడదు. ఈవేళ జమీందారుగారమ్మాయిలు ఆడుకోడానికి వస్తారుట! నేను కొంచెం తలదువ్వనా?" అని అడిగింది.

"వద్దండీ! కుర్రాడు పెద్దాడయ్యాడు, చూచిపోతాడు" అని బిందు అన్నది.

వేణమ్మ విస్తుపోయి, 'ఇదేమిటమ్మా, పిల్లలు పెద్దవాళ్లయ్యారని పుని స్త్రీలు తల ముడుచుకోరుటమ్మా? మానవహరి—వాడికి గిట్టనివాళ్లు కళ్లల్లో

దుష్మైత్ర—మరో ఆర్నెల్లుగాని ఏడాదిగాని పెద్దవాడే, అలా అని నేను తల దువ్వుకోడం మానేస్తానుటమ్మా?" అని అంది.

"ఎందుకూ మీరు మానేయడం? మీ సరహారి మొదటినుంచీ మీరు దువ్వుకోడమూ, కొప్పెట్టుకోడమూ చూచుకుంటూ వస్తూన్నాడు. కాబట్టి ఆ అబ్బాయ్ సంగతివేరు. కొత్తగా నేను జడేసుకుంటే అనంతం విడ్డూరంగా చూడకమానడు. నన్ను చూచి చప్పట్లు కొడతాడు. ఇంకా ఏమయినా... ఎబ్బే ఎబ్బే నాకు చాలా సిగ్గేస్తుంది" అని బిందు అంది.

అన్నపూర్ణ ఏదో పనిమీద వాళ్ల పక్కగా వెళుతూ బిందుకేసిచూచి చటుక్కున ఆగి, "అదేమిటి నీకళ్లు అలాఉన్నై? ఇటురా, వొళ్లుచూస్తాను" అని అంది.

వేణమ్మముం దీమాటలు రావడంవల్ల బిందు చాలా సిగ్గుపడి "ఎందుకమ్మా రోజురోజూ వొళ్లుమాడ్డం? నే నేం పసిపిల్లనా? జబ్బుచేస్తే నాకు తెలియదా" అని అంది.

"పసిపిల్లవు కావులే, మూడకాళ్ల ముసిలివి, దగ్గిరికి రా! శ్రావణ భాద్రపదాలు! జబ్బురోజులు" అని అన్నపూర్ణ అంది.

"ఎందుకమ్మా దగ్గిరికి రావడం? నేను రాను. కాక దగ్గలేదని చెబుతూంటే. నావొంట్లొ తిన్నగానే వుందని చెబుతూంటే ఎందుకూ దగ్గిరికి రామనడం?" అని బిందు అన్నది.

"సరే మంచిది, నన్ను మభ్యపెట్టకు" అని ప్రేమదృష్టులు ప్రసరింపజేస్తూ అన్నపూర్ణ వెళ్లిపోయింది.

"ఈమెమాటల్లో కొంచెం ఆడంబరం ఉంటుంది. ఏం, ఉండదూ?" అని వేణమ్మ అన్నది.

బిందు ఒకనిమిషం స్థిరంగా నిలుచుని—"అటువంటి ఆడంబరం అందరికీ వుంటుంది" అని అనేసరికి వేణమ్మ నోరు మూసుకుని ఊరుకుంది.

ఏదో వస్తువు పుచ్చుకుని ఆదారినే వెళుతూన్న అన్నపూర్ణను చూచి,-"అక్కా ఒకమాట, ఒకమాట, తల దువ్వించుకుని కొప్పెట్టించుకోంటారూ?" అని బిందు అన్నది.

అన్నపూర్ణ వెనక్కి తిరిగి నుంచొని కాసేపు నిశ్శబ్దంగా చూచి సంగతంతా గ్రహించి వేణమ్మతో-"చూచారా, నేనెంతో. చెపుతానమ్మా ఈవిడతో, చెప్పి యేం లాభం? అంత తలకట్టు! ఎన్నడూ దువ్వించుకోదు. అన్ని చీరలు! ఎన్నడూ కట్టుకోదు. అన్ని నగలు! ఎన్నడూ పెట్టుకోదు. అంత అందం! ఎన్నడూ చూచుకోదు. ఈవిడబుద్ధివంటి బుద్ధి సృష్టిలో ఎక్కడా నహి ప్రతిల్లై. కుర్రాడుగూడా ఈమెలాగే తయారు. ఆనా డేమన్నాడో విన్నావా బిందూ!—"బట్టలు కట్టుకోడం ఎందుకూ ? మా అమ్మ కన్నునై ! కట్టుకుంటుందా యేమిటి ?" అని అన్నది.

బిందువాసిని సగర్వంగా తలెత్తి నవ్వి, "అలాగా అక్కా? కుర్రాణ్ణి పదుగురితోపాటు తలెత్తుకుని తిరిగేట్టు చేయవలసివస్తే తల్లికి సృష్టిలో ఎక్కడా లేనిబుద్ధి ఉండవలసివస్తుంది. మీ రంతపర్యంతమూ చల్లగా ఉంటే లోకులందరూ "ఇదిగో ఈమె అనంతంతల్లి" అని అనడం వినగలరు." అని అంటూ అంటూ వుండగనే ఆమె రెండుకన్నులా తేమ ఎక్కుకుంటూ వచ్చె.

అన్నపూర్ణ అది చూచి ప్రేమతో—"అందుకనే మేమెవరమూ మీయిద్దరి నడుమా ఏమీ కల్పించుకోం. దేముడు నీకోరికను చల్లగా చూడాలి కాని 'పీడింత గొప్పవాడౌతాడు. పేరు ప్రతిష్టలు సంపాయిస్తాడు' అని మే మాశపెట్టుకోలేదు" అని అన్నది.

బిందు చెంగుతో కళ్లుతుడుచుకొని, "నేనైతే ఈవొక్క ఆశతోనే బతికున్నానమ్మా" అని అన్నది. ఆమె శరీరమంతా గగుర్పుచే కాకరకాయైంది. ఆమె సిగ్గుపడి బలవంతంగా నవ్వి,'కాదమ్మా అక్కా ! నా ఆశగ్గనుక ఏదైనా దెబ్బతగిల్తే పిచ్చెత్తేట్టుందమ్మా" అని అనింది!

దుష్మైత్ర—మరో ఆర్నెల్లుగాని ఏడాదిగాని పెద్దవాడే, అలా అని నేను తల దువ్వుకోడం మానేస్తానుటమ్మా?" అని అంది.

"ఎందుకూ మీరు మానేయడం? మీ నరహరి మొదటినుంచీ మీరు దువ్వుకోడమూ, కొప్పెట్టుకోడమూ చూచుకుంటూ వస్తూన్నాడు. కాబట్టి ఆ అబ్బాయ్ సంగతివేరు. కొత్తగా నేను జడేసుకుంటే అనంతం విడ్డూరంగా చూడకమానడు. నన్ను చూచి చప్పట్లు కొడతాడు. ఇంకా ఏమయినా... ఎబ్బే ఎబ్బే నాకు చాలా సిగ్గేస్తుంది" అని బిందు అంది.

అన్నపూర్ణ ఏదో పనిమీద వాళ్ల పక్కగా వెళుతూ బిందుకేసిచూచి చటుక్కున ఆగి, "అదేమిటి నీకళ్లు అలాఉన్నై? ఇటురా, వొళ్లుచూస్తాను" అని అంది.

వేణమ్మముం దీమాటలు రావడంవల్ల బిందు చాలా సిగ్గుపడి "ఎందుకమ్మా రోజురోజూ వొళ్లుమాడ్డం? నే నేం పసిపిల్లనా? జబ్బుచేస్తే నాకు తెలియదా" అని అంది.

"పసిపిల్లవు కావులే, మూడకాళ్ల ముసిలివి, దగ్గిరికి రా! శ్రావణ భాద్రపదాలు! జబ్బురోజులు" అని అన్నపూర్ణ అంది.

"ఎందుకమ్మా దగ్గిరికి రావడం? నేను రాను. కాక దగ్గలేదని చెబుతూంటే. నావొంట్లో తిన్నగానే వుందని చెబుతూంటే ఎందుకూ దగ్గిరికి రామనడం?" అని బిందు అన్నది.

"సరే మంచిది, నన్ను మభ్యపెట్టకు" అని ప్రేమదృష్టులు ప్రసరింప జేస్తూ అన్నపూర్ణ వెళ్లిపోయింది.

"ఈమెమాటల్లో కొంచెం ఆడంబరం ఉంటుంది. ఏం, ఉండదూ?" అని వేణమ్మ అన్నది.

బిందు ఒకనిమిషం స్థిరంగా నిలుచుని—"అటువంటి ఆడంబరం అందరికీ వుంటుంది" అని అనేసరికి వేణమ్మ నోరు మూసుకుని ఊరుకుంది.

ఏదో వస్తువు పుచ్చుకుని ఆదారినే వెళుతూన్న అన్నపూర్ణను చూచి,-"అక్కా ఒకమాట, ఒకమాట, తల దువ్వించుకుని కొప్పెట్టించుకోంటారూ?" అని బిందు అన్నది.

అన్నపూర్ణ వెనక్కి తిరిగి నుంచొని కాసేపు నిశ్శబ్దంగా చూచి సంగతంతా గ్రహించి వేణమ్మతో-"చూచారా, నేనెంతో, చెపుతానమ్మా ఈ విడతో, చెప్పి యేం లాభం? అంత తలకట్టు! ఎన్నడూ దువ్వించుకోదు. అన్ని చీరలు! ఎన్నడూ కట్టుకోదు. అన్ని నగలు! ఎన్నడూ పెట్టుకోదు. అంత అందం! ఎన్నడూ చూచుకోదు. ఈబిడబుద్ధివంటి బుద్ధి సృష్టిలో ఎక్కడా నహి ప్రతిల్లె. కుర్రాడుగూడా ఈమెలాగే తయారు. ఆనా డేమన్నాడో విన్నావా బిందూ!—"బట్టలు కట్టుకోడం ఎందుకూ ? మా అమ్మ కన్నుసై ! కట్టుకుంటుందా యేమిటి ?" అని అన్నది.

బిందువాసిని సగర్వంగా తలెత్తి నవ్వి, "అలాగా అక్కా? కుర్రాణ్ణి పదుగురితో పాటు తలెత్తుకుని తిరిగేట్టు చేయవలసివస్తే తల్లికి సృష్టిలో ఎక్కడా లేనిబుద్ధి ఉండవలసివస్తుంది. మీ రంతపర్యంతమూ చల్లగా ఉంటే లోకులందరూ "ఇదిగో ఈమె అనంతంతల్లి" అని అనడం వినగలరు.' అని అంటూ అంటూ వుండగనే ఆమె రెండుకన్నులూ లేమ ఎక్కుకుంటూ వచ్చై.

అన్నపూర్ణ అది చూచి ప్రేమతో—"అందుకనే మేమెవరమూ మీ యిద్దరి నడుమా ఏమీ కల్పించుకోం. దేముడు నీకోరికను చల్లగా చూడాలి కాని 'పీడింత గొప్పవాడౌతాడు. పేరు ప్రతిష్టలు సంపాయిస్తాడు' అని మే మాశపెట్టుకోలేదు" అని అన్నది.

బిందు చెంగుతో కళ్లుతుడుచుకొని, "నేనైతే ఈవొక్క ఆశతోనే బతికున్నానమ్మా" అని అన్నది. ఆమె శరీరమంతా గగుర్పుచే కాకరకాయైంది. ఆమె సిగ్గుపడి బలవంతంగా నవ్వి,'కాదమ్మా అక్కా ! నా ఆశగ్గనుక ఏదైనా దెబ్బతగిల్తే పిచ్చెత్తేట్టుందమ్మా" అని అనింది!

అన్నపూర్ణ నిశ్చేష్టయై ఊరుకుంది. ఆమెకీ తోడికోడలి హృదయం తెలియక ఉండలేదుకాని ఆమె ఆశయొక్క ఉగ్రమైన ఈ ప్రతిబింబం ఏనాడూ ఇంత విస్పష్టంగా అనుభవం కాలేదు. బిందు అనంతం విషయంలో యక్షుడిలా ఎందుకు కనిపెట్టుకుని వుందో, దయ్యంలా ఎందుకు సతర్కంగా వుందో ఆసంగతి అన్నపూర్ణ కీనాడు తెలిసివచ్చింది. తన కొడుకు బాగును గూర్చే రెప్పమూయని ఈ బిందువాసిని చూస్తూ చూస్తూ చెప్పరాని శ్రద్ధా మాధుర్యంచే ఆతల్లి హృదయం ద్రవించింది. పొంగి పొరిలి, వస్తున్న కన్నీటిని కనబడకుండా చేసేందుకు అన్నపూర్ణ మొహం అటు తిప్పుకుంది.

"మంచిది, సరేకాని, ఈవేళ నీకు..." అని క్షేణమ్మ అంటూండగా ఆపి, బిందువాసిని "ఈవేళ మీరు అక్కగారి తల దువ్వండి. నే నీయింటికి వచ్చిన తరువాత ఈమె తలదువ్వుకోగా ఎన్నడూ చూచిన పాపాన పోలేదు" అని ముసిముసి నవ్వులు నవ్వి అక్కడినుంచి వెళ్ళిపోయింది.

అయిదారురోజులు గడిచాక ఒకనాడు ఇంటికి వతనుగావచ్చే మంగలి యాదవునికి క్షౌరంచేసి పైనుంచి దిగివస్తున్నాడు. అనంతం అతని దారి కడ్డంకొట్టి "ఒరే గరుడాచలం! నరహరికి చేసినట్టు నాకు చేయగలవ్?" అని అడిగాడు.

మంగలికి ఆశ్చర్యం వేసింది, "నరహరిగారి క్షల్లా చేశానేమిటి?" అని అత డడిగాడు.

అనంతం తనతల చాలాచోట్లు చూపుతూ "ఇదుగో ఇక్కడ మువ్వాతిక, ఇక్కడ పాతిక, ఇక్కడ పరక, ఇదిగో ఇక్కడ ఈ మెడమీద నీ వెంత పొట్టిగా కత్తె రెయ్యగలవో అంతపొట్టిగా కత్తెరవెయ్యాలి. ఏం? తెలిసిందా?" అని అన్నాడు.

మంగలి నవ్వి, "నేను కాదుగదా నాయబ్బకూడా అలా కత్తిరించ లేదు చినదొరగారూ" అని అన్నాడు.

అనంతం వదలిపెట్టలేదు. మంగలిని ప్రోత్సహిస్తూ "అదేమంత కష్టం కాదురా, ఇక్కడ ముప్పాతిక, ఇక్కడ దాంట్లో సగం..."

మంగలి తప్పించుకోడానికి ఇలాఅన్నాడు: "ఇవ్వేళ వారమేమిటో తెలుసునున్నారూ? మీచిన్నమ్మగారి సెలవు లేకపోతే కత్తిరించడానికి వీలు లేదుబాబయ్యా!"

"అలాగా? నిలబడిఉండు! నేనువెళ్లి అడిగొస్తా" అంటూ అనంతం లోపలి కొక అడుగువేసి వెంటనే వెనక్కి తిరిగి "ఇదుగో, నీగొడు గోసారి ఇల్లాతే: లేకపోతే పారిపోతావ్" అని బలవంతంగా ఊళ్లాక్కుని పరుగెత్తు కొనిపోయి తుపానల్లే యింట్లోదూరి "అమ్మా, అమ్మా, వేగిరంగా ఓసారి ఇల్లా రావాలి"అని అన్నాడు.

బిందువాసిని అప్పుడే స్నానం చేసి జపమ్మీద కూచుంది. గడబిడపడి "ముట్టుకోకు ముట్టుకోకు, మడి మడి!" అని అన్నది.

"అమ్మా, అమ్మా, జపం తరువాత చేసుగుందుగానే, ఒక్కసారి బయటికి రొచ్చి మాటచెప్పిపోవే, లేకపోతే కత్తిరించేట్టు లేడే, గరుడాచలం వాకట్లో నిలబడి ఉన్నాడే."

బిందుకు కొంచెం ఆశ్చర్యం కలిగింది. ఎందుకంటే, అనంతానికి పని అంటే ప్రాణాంతకం. అటువంటివా డిప్పుడు తనంతట తానే ఎందు కిల్లా ఇష్టపడుతున్నాడో తెలియక వాకట్లోకి వచ్చింది. రాగానే మంగలి "అమ్మ గారుండీ! అబ్బాయిగారు నాకు చాలా కష్టమైనపని చెప్పారు. నరహరి గారికి మల్లే ఒకచోట మూడుపాళ్లు, మరోచోట ఆఱుపాళ్లు, మరోచోట ఎనిమిదీ పన్నెండూ ఇలా కత్తిరించాలిట. ఇది నాకు చేతనాతుందుండీ" అని అన్నాడు.

"నీకు చేతకాకపోడమేమిటి? భలే బాగా చేతనాతుంది. ఆగ్ కొంచె మాగు! నేనుపోయి నరహరిని పిలుచుకొస్తా" అని అనంతం ఇంట్లోకి పరిగెత్తి అటూ ఇటూ వెతికి తిరిగొచ్చి "ఇంట్లో లేడు. లేకపోతే లేకపోయాడులే. అమ్మా! కొంచెం నే పిక్కడ నీవునుంచోని చూపు! ఏం? సరిగా చూపు! ఇదుగో ఇక్కడ పాతిక, ఇక్కడ అర్థ, ఇక్కడ ముప్పాతిక, ఇక్కడ పరక, ఇక్కడ ఉన్నదే ఇక్కడ మరీ కురచ. చాలాచాలా కురచగా కత్తిరించాలి" అని అన్నాడు.

అనంతం తొందరకు బిందువాసిని నవ్వి "నే నిప్పుడు జపం చేసుకోవాలి, నాకువీల్లేదురా" అని అన్నది.

"జపం తరువాత చేసుగుందుగానిలే. ఇక్కడుండకపోతే నిన్ను ముట్టుకుంటా"

ఈమాటలతో బిందుకు నిలబడక తప్పిందికాదు.

మంగలి కత్తిరించడం మొదలేశాడు. బిందుకన్ను గిరిపింది. తలంతా సమానంగా కత్తెరపడ్డది. అనంతం తలతడుముకొని సంతోషంతో "భేషుగ్గా వుంది" అని గంతులు వేసుకుంటూ వెళ్లిపోయాడు.

గొడుగు చంకలో పెట్టుకుని గరుడాచలం "రే పిక్కడ అడుగు పెట్టడానికి నాకు ఇక వీలుండదదండీ అమ్మగారూ' అని అన్నాడు.

వంటలక్క విస్తళ్లో అన్నం పెట్టి అరుస్తూంది. బిందు వంటింట్లో ఒక మూల కూచుని గిన్నెలో పాలుపోస్తూపోస్తూ "ఎక్కడుందమ్మా! బ్రష్షు? బాబాయి తల దువ్వుకొనే బ్రష్షు ఎక్కడుందమ్మా? ఎక్కడ?" అనే అనంతం మాటలు విన్నది. ఇంకొంచెం సేపట్లోనే అనంతం ఏడుస్తూవచ్చి, బిందువీపుమీద పడి "అంథా పాడుపాడు చేసేశాడు. రేపు మంగలిని చంపిపారేస్తా" అని అన్నాడు.

బిందు మరి నవ్వాపుకోలేకపోయింది. అనంతం బిందువీపుమీంచి లేచి "నీ కేం కళ్ళు పోయాయా? గుడ్డిదానివా?" అంటూ కోపంతో ఏడ వడం ఆరంభించాడు.

ఈయేడుపు విని అన్నపూర్ణ అక్కడికి వచ్చి "ఇప్పు డేమ్మునిగి పోయింది రేపుమళ్ళా వచ్చి సరిగ్గా కత్తిరించిపోతాడు" అని అన్నది.

ఈమాటలకు మరింత మండి—"రేపు చేస్తాట్ట రేపు! రేవెల్లా చేస్తాడు? ఇక్కడ వేలెడుపొడు గుండాలి. ఎల్లా? అంతా మట్టంగా కత్తి రించి గుండుగుండు చేసిపొయె" అని అనంతం అన్నాడు. అతణ్ణి జోకొట్ట డాని కన్నపూర్ణ "పెద్దవేలెడు పొడుగు లేకపోయినా చిటికెనవేలెడు పొడు గుంటుంది" అని అన్నది.

"ఏడిసింది! చిటికెనవేలెడుకూడా ఒక పొడుగేనా? నరహరి నడుగు! ఇక్కడ పెద్దవేలెడు పొడుగుండాలని చెబుతాడు" అని అనంతం చిందులు తొక్కి అన్నం తిన్నగా తినక మెతుకు లటూ ఇటూ విసిరిపారేసి విస్తరి మీంచి లేచిపోయాడు.

"నీకొడుక్కు క్రాపింగుమీద మోజు ఎప్పటినుంచీ ఆరంభమైంది?" అని అన్నపూర్ణ అడిగింది. బిందునవ్వింది కాని వెంటనే గంభీరించి నిట్టూర్చి "అక్కయ్యగారూ! విషయంచాలా చిన్నదికాబట్టి నవ్వు వచ్చిందికాని నా గుండె లిగిరిపోతున్నాయమ్మా, అలవాట్లన్నీ ఈలానే అంకురిస్తాయ్" అని అన్నది. అన్నపూర్ణ మరి మాటాడ లేకపోయింది.

నవరాత్రాలు వచ్చెయ్. సరస్వతీపూజ ఆరంభం. ఆతల పేటలోవున్న జమీందారుగారి మేడలో పూజలు జోరుగా సాగుతున్నై. నరహరికి రెన్నాళ్లనుంచీ తీరికలేదు. అతడామేడలో పడిపోయాడు. సప్తమిరాత్రి అనంతం "అమ్మా, వారి మేడలో భాగోతం. చూడ్డానికిపోతా" అని పింతల్లిని చుట్టేసుకున్నాడు.

"ఈవేళకాదురా, రేపు" అని బిందు అంది.

"రాత్రి మూడుగంటలనుంచీ మొదలు పెడతారని నరహరి చెప్ప లేదూ?" అని అనంతం అన్నాడు.

"ఐతే ఇప్పటినుంచీ పోయి మంచులో కూచుంటావూ? అల్లా పీల్లేదు పొద్దున్నే మీ బాబాయిగారు వెళ్తారు. వారితో వెళ్తే నీకు మంచిచోటు దొరుకుతుంది. వేషాలన్నీ చక్కగా కనబడ్తై" అని బిందు అన్నది.

"ఊఁ ఊఁ, నన్ను పంపవూ? బాబాయి వెళతాడో వెళ్ళడో! వెళితే ఎన్ని గంటలకు వెళతాడో! నేనిప్పుడు పోతానమ్మా వెళ్లమనవూ?" అని అనంతం మూలగడం మొదలుపెట్టాడు.

"మూడింటికో నాలుగింటికో మద్దెలమీద దెబ్బపడగానే భైర వుణ్ణిచ్చి నిన్నక్కడికి పంపిస్తాగాని నీవిప్పుడు పడుకో" అని బిందు అన్నది.

అనంతానికి కోపం వచ్చింది. అతడు గోడకు మొహంపెట్టి మంచం మీద పడుకున్నాడు. బిందు చేయిచ్చుకు లాగింది. అనంతం చేయివిదిలించి బిగబట్టుకుని పడుకున్నాడు. ఇట్లాకొంతసేపయింది. ఇంట్లో అందరికీ నిద్ర పట్టిఉండవచ్చు వాకిట్లో గోడమీది పెద్దగడియారం గంటలు కొట్టింది. అనంతానికి మెలకువవచ్చింది. అతడు చెవులు దోరబెట్టివినడం మొదలు పెట్టాడు. 'ఒకటి, రెండు, మూడు, నాలుగు' అనంతం గబగబాలేచి బిందును అతలాకుతలం చేసి "అమ్మో అమ్మా! మూడూ నాలుగ్గూడా ఐపోయింది" అని అన్నాడు.

గడియారం ఈమాటలు వినిపించుకోక ఇంకాకొడుతూనేవుంది. అనంతం "ఐదు, ఏడు, ఎనిమిది" అని లెక్కపెట్టి "ఏడు కొట్టేసింది. ఇంకా ఎప్పుడు పోను?" అనిఏడ్చాడు. గడియారం ఊరుకోలేదు. తొమ్మిది పది పద కొండు పన్నెండుకొట్టి ఆగేసింది. అనంతానికి పొరపాటు తెలిసింది. అతడు

తెల్లపోయి మెదలకుండా పడుకుని ఊరుకున్నాడు. ఆగదిలోనే మరోప్రక్క- మరోమంచమ్మీద నిద్రపోతూన్న మాధవుడికి గందరగోళంతో మెలకువవచ్చింది. అతడులేచి బిగ్గరగా నవ్వి "ఏమిట్రా నాయనా!" అని అన్నాడు. అనంతం సిగ్గుపడి మాటాడ కూరుకున్నాడు. బిందు నవ్వి "ఎంత గందరగోళం చేసి నన్ను లేపాడో! ఇల్లు తగులడ్డా ఇంత అల్లరి ఎవరూ చెయ్యరు" అని అన్నది. అనంతం కుక్కిన పేనల్లే పడుకున్నాడు. బిందుకు జాలివేసి "సరేకాని, ఇహ భాగోతాని కెళ్లు. ఎవరితోటీ పోట్లాడకేం" అని భైరవుణ్ని పిలిచి దీపమిచ్చి అనంతాన్ని భాగవతం చూడ్డానికి పంపింది.

భాగవతం చూచి పొంగిపోతూ పదిగంటలప్పు డింటికి తిరిగివచ్చి అనంతం పింతండ్రిని చూచి "నీవు చూడ్డానికి రాలే దేం?" అని అడిగాడు. "భాగోతం ఎల్లావుంది?" అని బిందు అనంతాన్ని అడిగింది.

చాలా బావుంది బాబాయోయ్! ఈసాయంకాలమే మళ్ళా మేజువాణీ చేస్తారట. మండపేటనుంచే ఇద్ద రొచ్చారు. నరహరే వాళ్ళను చూపాడు ఎల్లా ఉన్నారనుకున్నావ్. అచ్చు అమ్మల్లే. ఎంతో బావున్నారు. వాళ్ళాడతారని నాన్నక్కూడా చెప్పేచా" అని అనంతం అన్నాడు.

"మాంచి పని చేశావ్" అని మాధవుడు బిగ్గరగా నవ్వాడు.

బిందువాసిని మొహం కందింది.—"విన్నారా పొన్నెమ్మ మీ మేనల్లుడి మాటలు! కుంకా, నీ విహ అక్కడికి వెళ్లొద్దు ఒరే! నాలాడున్నారని నీకు చెప్పిందెవరు? నరహరా?" అని అన్నది. అనంతం భయపడుతూ భయపడుతూ "ఆఁ, ఔను, నరహరి వాళ్ళను చూపాడు" అని అన్నాడు. "ఏడీ నరహరి? అతగాణ్ణి రానీ" అని బిందు అన్నది. మాధవుడు నవ్వాపుకుని "నీకేం వెర్రా? ఈ కథంతా అన్నగారు విన్నారు మరి గడబిడ చేయకు" అని అన్నాడు. దాంతో కోపం మింగి లోలోపలనే ఉడికిపోవడం తప్ప బిందువాసినికి గత్యంతరం కనబడలేదు.

పొద్దొక్కుమునుపే అనంతం అన్నపూర్ణను ముట్టడించి "మేజువాణీ చూడ్డానికి పోతానే, ఇదిగో, చూచి ఇప్పుడే పరుగెత్తుకునివస్తానే? అని అన్నాడు. పనితొందరలో ఉన్న అన్నపూర్ణ "పోయి మీ అమ్మ నడుగు" అని అన్నది. అనంతం పట్టిన పట్టు వదలక "లేదే అమ్మా, ఆలస్యం ఎంత మాత్రం చేయకుండానే వస్తానే అమ్మా! వెళ్ళమనవ్ వెళ్ళమనవ్" అని అన్నాడు.

"వొద్దొద్దు. మీ అమ్మకు కోపం వస్తుంది. నీవు మీ అమ్మ నడిగి మరీ పో" అని అన్నపూర్ణ అన్నది.

అనంతం ఏడు పారంభించి కొంగుచ్చుకుని అటూ ఇటూ లాగి చిందులు తొక్కుతూ "నీవు చెప్పకు. నేను నరహరితో వెళ్తా. వెంటనే పరుగెత్తుకొస్తా" అని అన్నాడు.

"నీవు నరహరితో గనుక వెళ్తే..." అని అన్నపూర్ణ ఏమో చెప్పబోతూ వుండగానే అనంతం దౌడుతీశాడు.

ఇంకొక గంటకు బిందువాసిని అనంతుణ్ణి వెదకడం ఆరంభించింది. అన్నపూర్ణ ఇది కనిపెట్టి మాటాడ కూరుకుంది. క్రమక్రమంగా వెదుకుడు ఎక్కువైంది. అప్పు డన్నపూర్ణ మొహం బయటికి పెట్టి "అక్కడ మేజువాణి జరుగుతూందట, అబ్బాయి నరహరితో అక్కడికి వెళ్ళాడు. ఇప్పుడే వస్తాడు. మరేమి భయంలేదు" అని అన్నది. "ఎవరు వెళ్లమన్నారు? మీరా? అని బిందు దాపుగా వచ్చి అడిగింది. తన సమ్మతి లేకుండానే అనంతం వెళ్ళాడని చెప్పడాని కన్నపూర్ణ భయపడి "ఇప్పుడే వస్తాడులే" అని అన్నది. బిందు మొహం నల్లబడేసుకుని వెళ్లిపోయింది.

కొంతసేపటి కనంతం ఇంటికి వస్తూనే పింఛల్లీ పిలుపు విని తండ్రి మంచమ్మీద ఓరగా పడుకున్నాడు. యాదవుడు కళ్లజోడు పెట్టుకుని దీపం

ముందు భాగవతం చదువుకుంటున్నాడు. అతడు మొహమెత్తి "ఒరె అబ్బాయీ" అని పిలిచాడు అనంతం మాటాడలేదు. కదంబ వచ్చి "అమ్మ గారు రామంటున్నారు రండి' అని అన్నది. అనంతం లేచి మెల్లగా తండ్రి దగ్గరకు వెళ్ళి "నీవు పంపించి వస్తువుగానిరా నాన్నా" అని అన్నాడు. యాదవు డాశ్చర్యపడి, "నేను పంపించి రావాలా? ఏమిటే సంగతి?" అని కదంబ నడిగాడు. అది జరిగినసంగతంతా చెప్పేసింది.

"ఒకరు వెళ్లద్దన్నారు, ఒకరు వెళ్లమన్నారు దీన్ని దొరకబుచ్చుకుని కలహం కలగకమానదు" అని యాదవుడు గ్రహించి అనంతాన్ని వెంట బెట్టుకుని వెళ్లి మరదలిగదిబయట నుంచోని "ఇదిగో ఈతడవ వీణ్ణి క్షమించేం? మరి ఇటువంటి పని ఇక చేయనని వీ డంటున్నాడు" అని అన్నాడు.

ఆరాత్రి తోడికోడళ్లిద్దరూ అన్నాలముందు కూచున్నప్పుడు బిందు "నాకునీమీద కోపమేమీలేదమ్మ! ఇహ విను! నే నిహ ఇక్కడ ఉండలేను. అలాఉంటే అనంతం పూర్తిగా చెడిపోతాడు. నేను వాణ్ణి భాగోతానికి వెళ్లద్దు అని అనకపోతే అప్పటిమాట వేరు. వెళ్లద్దు అని గట్టిగా చెప్పితి నాయిరి, ఇల్లా చెప్పినా వీడి కింత దుస్సాహసం ఎల్లా వచ్చిందీ అని నే నప్పట్నుంచీ ఇదే ఆలోచిస్తూ కూచున్నా. సరే, పైగా ఈ పాడుబుద్ధి చూడు— నావద్గిరికి రాక నీదగ్గిరికి రావడం. ఇంటికి వస్తూనే నాపిలుపు విని తండ్రిగారి దగ్గిరికిపోయి ఆయన్ను వెంటేసుకు రావడం. అక్కయ్యా! ఇన్నాళ్లనుంచీ వీడికీ బుద్ధులు లేవమ్మా! ఈతుర్రాడు కాస్తా ఇల్లా చెడిపోతూవుంటే ఇక్కడుండి వీణ్ణి చూస్తూ ఏడుస్తూ కూచోటంకంటె పట్నంపోయి అక్కడ ఒక అద్దెయింట్లో ఉంటానమ్మా అని అన్నది.

అన్నపూర్ణ మనుస్సులో కష్టపడి "మీరందరూ వెళిపోతే నే నొక్కత్తెనూ ఇక్కడ ఎల్లా ఉండగలనమ్మా!" అని అన్నది.

బిందు కొంచెంసే పూరుకుని "ఆసంగతి నీకే తెలియాలి. నా సంగతి చెప్పివేశాను. ఆనరహరి పట్టి పాడువాడమ్మా" అని అన్నది.

"అలాగా? నరహరి ఏం చేశాడు? అయితే, సరేకాని, వీళ్ళిద్దరూ అన్నదమ్ములైతే నీ వేం చేసేదానివి?"

"ఏం చేసేదాన్నా? నౌకరుచేత కాళ్లూచేతులూ అంటకట్టించి 'పేం బెత్తముచ్చుగుని ఒళ్లు పట్టినన్ని ఉతికి తగిలేసేదాన్ని. ఇంతేకాక ఈ 'అయితే గియితేలు' కార్యకారులు కావమ్మా! వీళ్లను మీరిక్కణ్ణుంచి తోలేసెయ్యండి."

ఈమాటలకు విప్రియం పొంది అన్నపూర్ణ—"తోలెయ్యడమూ, ఇంట్లో ఉంచుకోవడమూ నాచేతిలో ఉందా? వీరి నిక్కడికి తీసుకొచ్చిన వారితో ఈసంగతి చెప్పాలిగాని వృథాగా నాతో ఎందుకూ?" అని అన్నది.

"నే నీమాట లన్నీ బావగారితో ఎలా అనేదమ్మా?"

"అన్నిమాటలూ ఎలా గంటున్నావో ఇవీ అలాగే."

బిందు విస్తరి ఎడంగా తోసి "నన్ను పిచ్చదాన్ని చెయ్యాకమ్మా! నా కిరవై యొూరవై యేడేళ్లు నిండొచ్చాయ్. ఇది నవుకర్లమాటా చాకర్లమాటా కాదు ఇదిస్వజనానికి సంబంధించింది. నీవుండగా నేనీమాటలన్నీ బావగారితో చెప్తే వారికి కోపంరాదూ?"

"తప్పకవస్తుంది. నేనుగనుక చెబితే నా మొహం చూడరు. నువ్వు లక్ష చెప్పు. మనం పరాయివాళ్లం. వాళ్ళు అన్నాచెల్లెళ్లూ. ఈసంగతి ఆలోచించుకోవేం? అదీకాక నాకు వయసు వెళ్లమారిపోయింది ఈలేతమాటపుచ్చుకుని నేను చిందులు తొక్కితే లోకులు నన్ను వెర్రిదానికింద జమకట్టరూ?"

బిందువాసిని విస్తరి మరికాస్త ముందరికి తోసి మోతి ముడుచుకుని కూచుంది. బావగారి భయంతో అల్లాకూచుందని అన్నపూర్ణ గ్రహించి "చేతులు ముడుచుకుని అలా కూచున్నా వేం? విస్తరేంపాపం చేసుకుంది"

అని అంది. బిందువాసిని హఠాత్తుగా నిట్టూర్చి "నేను తింటం అయింది" అని అంది.

అన్నపూర్ణ ఆమెపోశెం కని పెట్టి మరి బలవంతం చేయలేదు.

బిందు గదిలో పడుకోబోయి అనంతాన్ని కానక తిరిగివచ్చి "కుర్రా డెక్కడికి వెళ్లాడు" అని అడిగింది.

"ఇవ్వేళ నా మంచమ్మీద సింగారించిన ట్లున్నాడు. ఎత్తుకొచ్చి ఇస్తావుండు" అని అన్నపూర్ణ అన్నది.

"వద్దులే వద్దు" అని బిందు ముఖం అంధకారం చేసుకుని వెళ్ళి పోయింది.

నడిరేయి. బిందువాసిని కలతనిద్ర అన్నపూర్ణ పిలుపుచే భగ్నమైంది.

"ఏమిటండీ అక్కయ్యా?"

"నీ కుర్రాణ్ని నీవు తీసుకో! తలుపు తియ్! వీడి గడుగ్గాయితనం నేను కాదుగదా అబ్బకూడా భరించలేడు"

బిందు తలుపు తెరవగానే అన్నపూర్ణ అనంతాన్ని తీసుకుని గదిలోకి పోయి "నేను అనేకమంది దిష్పకాయలను చూచానుగాని ఇటువంటి రణదిష్ప కాయ నెక్కడా చూడలేదు. రెండయింది ఇంతవఱకు కునుకు పట్టనిచ్చా డనుకున్నావా? —'దోమలు కుడుతున్నై, మంచిసీ ళ్ళవుతున్నై, చెమట పోస్తూంది. అబ్బ, అమ్మ, విసురు!' అంటూ చంపేశాడు. పొద్దున్న లేస్తే రాత్రి పదింటిదాకా నాకు తీరదు. కొంచెం నిద్దురపోకపోతే బతకలేను" అని అన్నది.

బిందు నవ్వి చేతులు,జాపగానే! అనంతం అమాంతంగా ఆమె చేతుల లోకి పోయి ఆమెమీద తల వాల్చి ఒక్క నిమిషంలోనే నిద్రపోయాడు.

మరొక మంచ మ్మీద పడుకొన్న మాధవుడు "మీ ఉబలాటం తీరిందా?" అని పరిహాసించాడు.

"నే నుబలాటపడ లేదండీ. నేను కొట్టిపోతానని ఇవ్వేళ తల్లిదగ్గిరికి చేరాడు. నాకు తగిన శాస్తే అయింది. నీ దగ్గిర పడుకోడానికి నాకు సిగ్గేస్తుం దని అంటాడు. చూచారా వీడి అసహ్యపుమాటలు!"

ఈ మాటలకు ముగ్గురికీ నవ్వు వచ్చింది.

"చా లివ్వాళిటికి. నేను పోయి కొంచెం నిద్దరోతాను" అని అన్నపూర్ణ వెళ్లిపోయింది.

ఇది జరిగిన పదిరోజులకు పుట్టింటికి రమ్మని బిందువాసినికి కబు రొచ్చింది. మేనాకూడా వచ్చింది. ఆమె తలిదండ్రులు తీర్థయాత్రలకు పోతారుట! వెళ్ళేముందు కూతుర్ని కొన్నాళ్ళింట్లో ఉంచుకొంటారట!

బిందువాసిని ఇందుకుగాను తోడికోడలి అనుమతి పుచ్చుకుంది. రెండు మూడు రోజులు పుట్టింట ఉండిరావడానికి అనంతానికి తెలియకుండా సరంజామా సర్దుతూంది. ఆమెసరిగ్గా మేనా ఎక్కబోయే ముందు పలకా పుస్తకాలూ చంకబెట్టుకొని అనంతం బడికి తయారై అక్కడికి వచ్చాడు. ఇంతకుముందే వాకట్లోంచి యింట్లోకి వస్తుండంగా అతనికి ఇంటి ముందు మేనా కనబడ్డది. ఇంట్లో బిందు పాదాలమీద పారాణి కనబడ్డది ఇల్లా కనబడంగానే "పారాణి ఎందుకు పెట్టుకున్నా వమ్మా?" అని అతడు పింతల్లి నడిగాడు. అన్నపూర్ణ దాపుగానే ఉంది. నవ్వింది బిందు "ఇవ్వేళ అల్లా పెట్టుకోవాలి" అని అంది.

అనంతం కిందినుంచి మీదిదాకా చాలాసార్లు చూచి "ఈనగలన్నీ యేమిటి?" అని అడిగాడు.

అన్నపూర్ణ మఖమ్మీదికి పైట తీసుకుని అవలికి వెళ్ళింది. బిందు నవ్వాపుకుని ఎప్పుడో నీ పెండ్లాం వచ్చి నగలు పెట్టుకోబోతుందని మా

అందర్నీ ఇప్పట్నుంచీ నగలు పెట్టుకోకుండా కూచోమన్నావా యేంరోయ్? పో బళ్లోకి పో" అని అన్నది.

అనంతం ఈమాటలు చెవినిపెట్టక "అమ్మా అమ్మ! అక్క అల్లా నవ్వి పోతుం దెందుకూ? నే నీరోజు బళ్ళో కెళ్ళను. నీవెక్కడికి వెళ్తావ్ చెప్పవూ? "అని అడిగాడు.

"నేనెక్కడికి వెళ్తే నీ కేం? నేను వెళ్ళేముందు నీయాజ్ఞ తీసుకుని మరీ వెళ్ళాలా యేమిటి?"

"నేనూ వస్తా" నని అనంతం పుస్తకా లుచ్చుకుని వెళ్లిపోయాడు.

"వీడింత సహజంగా బళ్లోకి పోతాడని నే ననుకోను వాడెల్లా పసిపట్టాడో చూచావా? 'పారాణి ఎందుకు పెట్టుకున్నావ్? నగ లెందుకు పెట్టుకున్నావ్? అని అంటాడు చూచావా? సరేకాని, ఇకలాభంలేదు. వీణ్ణి వెంటబెట్టుకుని పో, లేకుంటే బళ్లోంచి వచ్చి వీడు చేసే గందరగోళానికి మితీ మేరా ఉండదు" అని అన్నపూర్ణ అన్నది.

"బళ్ళోకి వెళ్ళా డనే అనుకుంటూన్నావుటమ్మా? ఎప్పుడూ వెళ్ళడు. ఎక్కడో దాక్కుంటాడు. నేను సరిగ్గా మేనా ఎక్కబోయేముందు ఎక్కణ్ణుంచో ఊడిపడకపోతే చూడు" అని బిందు అన్నది.

సరీగా అలాగే జరిగింది. అత డెక్కడో దాక్కున్నాడు. బిందు అన్నపూర్ణకు నమస్కారం చేసి మేనా ఎక్కబోతూంది. అనంతం ఎక్కణ్ణుంచో ఊడి పడి బిందువాసినికొం గుచ్చుకుని నిలబడ్డాడు. తోడికోడళ్ళిద్దరూ నవ్వుకున్నారు.

"వెళ్లేముందు కోలాహలం చెయ్యకు వీణ్ణికూడా తీసుకుపో" అని అన్నపూర్ణ అన్నది.

"తీసుకునే వెళతా ననుకో! అక్కడేమైనా నన్నొక అడుగు కదల నిస్తాడా? వీడితో నేను వేగలేను" అని బిందు అన్నది.

"నీవు వాణ్ణి అలా తయారుచేశావ్! అనంతం! ఈరెన్నాళ్ళూ నీవు నాదగ్గర ఉండిపో" అని అన్నపూర్ణ అన్నది.

అనంతం తలతిప్పుతూ "నేను నీదగ్గర ఉండకేం?" అని మేనాలో ఎగిరి కూచున్నాడు.

---

# ౬

బిందువాసిని పుట్టింటినుంచి తిరిగివచ్చిన పదిరోజుల కొకనాడు అన్నపూర్ణ ఆమె గదిలోనికి వెళ్లి 'చెల్లీ!' అని పిలిచింది.

మాసిన గుడ్డలు ఒక గుట్టెడయితే ముందు పడేసుకుని కూచుంది చెల్లెలు.

"చాక లేమయినా వచ్చాడా?" అని అడిగింది అన్నపూర్ణ.

తోడికోడలు మాటాడలేదు. అన్నపూర్ణ ఆమె ముఖభంగి చూచి భయపడ్డది. "అల్లా కూచున్నావేం?" అని ఉద్వేగంతో అడిగింది.

బిందువాసిని కాల్చిన సిగరెట్ పీకెలు కొన్నిచూపి "ఇవి అబ్బాయి జేబుల్లోంచి బయటబడ్డయ్" అని అన్నది.

మాటరాక అన్నపూర్ణ మొద్దల్లే నిలబడి పోయింది.

బిందువాసిని హఠాత్తుగా ఏడ్చేసి "మీకాళ్ళట్టుకుంటా. వాళ్ళ నిక్కడ నుంచి పంపేసినా సరే, లేకపోతే మమ్మల్నిక్కణ్ణుంచి పంపేసినా సరే, మీ యిష్టం. ఈ రెంటిలో ఏదో ఒకటి చేయండి" అని అన్నది.

అన్నపూర్ణ జవాబు చెప్పలేకపోయింది. ఆమె మరి రెండు నిమిషాలు అక్కడే నిల్చుని మాటాడకుండా వెళ్లిపోయింది.

అపరాహ్ణంవేళ అనంతు డింటికొచ్చి ఫలాహారంచేసి ఆడుకోడానికి వెళ్లాడు. బిందువాసిని అతనితో ఒకమాటకూడా మాటాడలేదు. అటుతరువాత భైరవుడు బిందువాసినిదగ్గిరికి పరుగెత్తుకొచ్చి "అమ్మగారండీ, నరహరి బాబు గారు నావల్ల తప్పేమీ లేందే లేంపకాయ కొట్టారు చూడండి అని మనవి చేశాడు.

బిందువాసిని పెదవి విరిచి "పోయి అక్కగారితో చెప్పు"అని అన్నది.

మాధవుడు కోర్టునుంచి తిరిగివచ్చి బట్టలు మార్చుకుంటూ మార్చుకుంటూ కొద్దిగా సరసం చెయ్యబోయి చివాట్లు తిని నోరు మూసుకున్నాడు. ఎవరికీ తెలియకుండా ఈ యింట్లో తుపాను పెరిగిపోతూ ఉండడం ఒక్క అన్నపూర్ణకే తెలుసు. సాయంకాలంవరకూ ఆమె ఎలాగో ఒకల్లా అకష్టమంతా సహించి తుదకు ఒంటరిగా చూచి బిందువాసిని చేతులు రెండూ పట్టుకుని సవినయంగా "వేయింటికీ వాడు నీకొడుకే, ఈసారి వాణ్ణిక్షమించు! లేకపోతే చాటుకు పిలిచి రెండు చివాట్లుపెట్టు" అని అన్నది.

"ఇదిగో, అతడు నాకొడుకు కాడు. ఈమాట నాకూ తెలుసు, మీకూ తెలుసు ఊరికే మాటలు పెంచుకోవడ మెందుకు?" అని బిందుఅన్నది.

"నేనుకాదు, నీవే వాడితల్లివి. నేను వాణ్ణి ఎప్పటికీ నీ కిచ్చెయ్యలేదూ?" అని అన్నపూర్ణ అన్నది.

"చిన్నప్పుడు అతణ్ణయితే నేను పెంచానుగాని ఇప్పుడు పెద్దవాడై పోయాడు. ఇహ మీకుర్రాణ్ణి మీరు తీసుకోండి. నాకు సెలవు" అని బిందువాసిని వెళ్లి పోయింది.

రాత్రి ఏడుపుమొహంతో అనంతం అన్నపూర్ణ దగ్గిరికి చేరాడు.

అన్నపూర్ణ గ్రహించి, విరక్తితో "ఇక్కడికి కొచ్చా వెందుకూ ? పో, ఇక్కణ్ణించి పోతావా పోవా?" అని అన్నది.

అనంతం అక్కడినుంచి మెల్లగా తండ్రిగదిలోకి వెళ్ళాడు. అతడు నిద్దరలో ఉన్నాడు. అనంతం మరి మాటాడక బయటికి వెళ్లిపోయాడు.

తెలవారుకట్ట కదంబ అంట్ల గిన్నెలు తీసుకుని వెళ్ళడానికి వంటింటి ముందరికి వచ్చి వరండామూల పుల్లలూ పిడకలూ కలిపిన గుట్టమీద, అనంతం నిద్ర పోతుండడం చూచి గబగబా పరుగెత్తి బిందువాసినిని తీసుకుని వచ్చింది. అన్నపూర్ణకూడా లేచి వాళట్లోకి వస్తూంది. వచ్చి వీళ్ళపక్కనే నిలుచుంది.

"అక్కయ్యగారూ! రాత్రి ఇతన్ని మీరు నెట్టి పారేశారా? అత ఘుంటేమీకు నిద్రాభంగం కాదూ?" అని బిందు అన్నది.

కొడుకుఅవస్థకూ కలతచేతా, దుఃఖంచేతా, అన్నపూర్ణకుకూడా కళ్లలో నీరు తిరిగిందికాని బిందువాసిని నిష్ఠురంగా ఎత్తిపొడవడంవల్ల అట్టుడికి పోయి "ఇదుగో, నీవు నీతప్పు ఇతరులమీద మోపందే బతకలేవు" అని అన్నది.

బిందువాసిని కుర్రవాణ్ణి ఎత్తుకుందామని వెళ్లిఒళ్లు పట్టి చూచింది. వెచ్చగా ఉంది. "జ్వరం వచ్చినట్లుంది" అని, "ఈకార్తికమాసపు మంచులో రాత్రల్లా పడుక్కుంటే జ్వరం రాదా? తగ్గిపోవాలి బాబూ! తగ్గిపోతే బతికి పోతాను" అని అన్నది.

అన్నపూర్ణ తొందరతొందరగా దాపులకువచ్చి ముందుకు వంగిచూచి "ఏదీ జ్వరం వచ్చింది? చూదాం" అని అన్నది.

బిందువాసిని గాఠ్ఠిగా ఆమెచేయి తోసేసి "చాల్లేండి. మీరు చూడక్కరలేదు" అని విదిలించి, నిద్రపోతున్న కుర్రవాణ్ణి మెల్లిగా ఎత్తుకొని అన్నపూర్ణ మీద ఒక విషపు చూపు విసిరి తన గదిలోకి వెళ్లిపోయింది.

అయిదారు రోజులకే అనంతుడికి మళ్లా ఆరోగ్యం కలిగిందికాని, బిందువాసిని తోడికోడలి అపరాధాన్ని మాత్రం సహించ గలిగింది కాదు. ఆనాడు మొదలుకొని బిందువాసిని అన్నపూర్ణతో తిన్నగా మాటాడడం మానేసింది.

అన్నపూర్ణ సమస్తమూ ఎరుగు. అలా ఎరిగిన్నీ ఆమెకూడా మౌనం దాల్చింది.

బిందువాసిని అందరియెదుటా ఈ అపరాధమంతా తనమీదే మోపడం అన్నపూర్ణకూడా మరచిపోలేక పోయింది. ఒకనాడు వేణమ్మా, తానూ

మాటాడుతూ కూచున్నారు. ఏదో మాటమీద "వాడి అదృష్టంవల్ల చావ లేదుగాని, పినతల్లిగారి వల్లనే ఆనాడు వాడికి జ్వర మొచ్చింది" అని అన్న పూర్ణ పొక్కింది.

వేణమ్మ ఈమాట బిందువాసిని దగ్గిరికి మోసుకెళ్లడాని కెంత మాత్రమూ ఆలస్యం చేయలేదు. బిందు చక్కగా వినదికాని పయికేమీ అనలేదు. ఈమాట ఆమె వినడ మనేది వేణమ్మకు తప్ప ఇంకొకరికి తెలియదు.

బిందువాసిని అన్నపూర్ణతో మాటాడడం సాంతంగా కట్టిపెట్టేసింది. చాలా రోజులనుంచీ ఈ యింటిసామాను లన్నీ కొత్తగా కట్టిన మేడలోకి తీసుకుపోతున్నారు. రేపు పొద్దున్నే అందరూ అక్కడికి వెళ్లిపోతారు. యాదవుడు పిల్లలను పెట్టుకుని ఆ యింట్లో ఉన్నాడు. మాధవు డేదో కేసు పనిమీద మరోవూరు వెళ్లాడు. ఇంట్లో మగవాళ్లెవళ్లూ లేరు. ఇటువంటి సందర్భంలో ఈ యింట్లో ఒక గందర గోళం జరిగింది. సాయంకాలప్పూట పిల్లాడికి పాఠం చెప్పడానికి పంతులుగారురాగా, ఏమిబుద్ధిపుట్టిందో, బిందు ఆయనను పిలిపించి "అయ్యా పంతులుగారూ, రేపటినుంచీ మీరు ఆయింట్లో పాఠం చెప్పండి" అని అనగానే 'చిత్తం చిత్తం' అని అనుకుంటూ పంతులు గారు వెళుతుండగా బిందు "మీశిష్యుడు తిన్నగా చదువుకుంటున్నాడా?" అని అడిగింది.

"చదువులో అతడు మొదటినుంచీ మేలే. ప్రతిమాటూ స్పష్టే"

"అయితే కావచ్చుగాని ఇప్పుడు సిగరెట్లు నేర్చుకుంటున్నాడండీ"

పంతులు "సిగరెట్ నేర్చుకుంటున్నాడూ? అని ఆశ్చర్యపడ్డాడు. ఇల్లా ఆశ్చర్యపడి వెంటనే "ఇందులో ఏమీ ఆశ్చర్యంలేదు. వాణ్ణీ వీణ్ణీ చూచి పిల్లలు నేర్చుకుంటారు" అని అన్నాడు

"ఎవరిని చూచి?" అని బిందు అడిగింది. పంతులు మాటాడలేదు. "ఈసంగతి మీరు ఇతని తండ్రిగారితో చెప్పండి" అనిబిందు అన్నది.

పంతులు తలతిప్పుతూ, "ఇది వినండి యిప్పటి కయిదారు రోజులయింది, బళ్లోకి వెళ్లే దార్లో ఒకతోట ఉంది. కొందరు పిల్లలు అందులో దూరి మామిడిపిందెలు కొట్టి మండలు విరిచేశారు. తోటమాలి వచ్చి గోలపెడితే వాణ్ణి పట్టుకు తన్ని ఒక యుద్ధకాండ చేశారట. ఈసంగతి మాహెడ్‌మాస్టరుగారు చెప్పారు" అని అన్నాడు.

బిందు ప్రాణాలు బిగబట్టుకొని "ఆ తరువాత ఏమి జరిగింది"? అని అడిగింది.

"ఆతరువాత తోటమాలి హెడ్‌మాస్టరుగారి దగ్గిరికి పోయి లబలబ లాడాట్ట. ఆయన పిల్లలకు పదిరూపాయలు జరిమానా వేసి వాడి కిచ్చి శాంత పరచి పంపించారట."

బిందువాసిని ఈమాటలు నమ్మలేక "మాఅనంతంకూడా వారిలో ఉన్నాడా? వీడికి డబ్బెక్కణ్ణుంచి వొచ్చింది?" అని అడిగింది.

"ఆసంగతంతా నాకు తెలియదుగాని వారిలో అనంతంకూడా ఉన్నాడు. మీయింట్లో వుండే నరహరికూడా ఉన్నాడు. ఇంకా నలుగు రయిదుగురు పెద్దపిల్లకాయలుకూడా ఉన్నారు. మా హెడ్‌మాస్టరుగారు చెబుతూవుండగా నేను విన్నాను"

"డబ్బుకూడా వసూలయిందా?"

"ఆ, అదికూడా వసూలయిం దని విన్నాను"

"మంచిది, మీ రిహ వెళ్లండి" అని బిందువాసిని అక్కడే కూలబడ్డది. "నాకు చెప్పకుండా వీడికి డబ్బిచ్చే సాహసం ఈయింట్లో ఎవరికుంది?" అనే యీ ఒక్కమాట ఆవిడనోట్లోనుంచి అస్ఫుటంగా బయటికి వొచ్చింది. ఒకచెంప ఆమెమనస్సు పాడై వుంది. అందులో అక్కగారితో మాటా మంతీ మానే సింది. దానిమీద ఈసంగతొకటి వచ్చి ఆమెకు వెర్రెత్తేసింది. ఆమె అక్క

క్షించి లేచి వంటింట్లోకి వెళ్ళింది. అన్నపూర్ణ రాత్రికిగాను కూరతరుగుతూ మొహమెత్తి చూచింది. తోడికోడలు మొహంమీద మబ్బులు!

"అక్కగారూ! మీ రీనడుమ అనంతుడి కేమయినా డబ్బిచ్చారా?"

సరిగ్గా ఈమాటే అడుగుతుం దని అన్నపూర్ణ భయపడిపోతూంది. భయంతో ఆమెనాలుక యెండి చక్కాపోయింది. "ఎవరు చెప్తారూ?" అని మెత్తగా అడిగింది.

"ఆమాట అంత అవసరం కాదు. అతడేమని పుచ్చుకున్నాడు, మీ రేమని ఇచ్చారు? ఇదే అవసరం" అని బిందు అన్నది. అన్నపూర్ణ మాటాడ కూరుకుంది.

నే నతనిని అదుపులో ఉంచడం మీకిష్టంలేదు. అందుకోసమే మీరు నాదగ్గిర ఈమాట దాచారు. అనంతు డెన్ని పాడుపనులు చేసినా పెద్దల దగ్గర అబద్ధాలు చెప్పడు. మీకు అతడు చేసిన పని తెలిసిఉండవచ్చు తెలిసే మీరిచ్చారు. నిజమవునాకాదా చెప్పండి" అని బిందు అన్నది.

అన్నపూర్ణ మెల్లమెల్లగా "నిజం. కాని ఈ ఒక్కసారిమాత్రం వాణ్ణి క్షమించు చెల్లీ! నేను క్షమాపణ కోరుతున్నాను" అని అన్నది.

బిందువాసిని లోపల్లోపల ఉడికిపోతూ "ఈ ఒక్కసారా? ఇప్పటినుంచీ ఇక చివరవరకూక్షమించాను. ఇక చెప్పను. మరి మాటాడను. ఇతడిల్లా నాకళ్ళయెదుట కొంచెంకొంచెంగా పాడైపోవడం చూచి నేను సహించలేను. ఇంతకంటె ఒకేసారి పాడైపోనిండిగాని, అమ్మా! మీ కెంత సాహసమూ!" అని అన్నది.

ఈ చివరమాట అన్నపూర్ణకు గాటంగా తగిలింది. అయినప్పటికీ ఆమె యేమీ మాటాడలేదు. కాని మాటనుకుంటూపోతున్న కొద్దీ బిందువాసినికి క్రోధం ఎక్కుకుంటూపోయింది. ఆమె మళ్లీ ఇల్లాగర్జించింది; "అన్ని విష

యూ లోనూ మీకు వెర్రిబాగులదానికిమల్లే కూంచి 'ఈసారి క్షమించు ఈ సారి క్షమించు' అని అంటూ కూచుంటారు. దోషమంతా మీదిగాని అతని దేమంతకాదు. మిమ్మల్ని మాత్రం నేను క్షమించను."

చాటుగా ఉండి నవుకరులూ, చాకరులూ ఈమాటలన్నీ వింటున్నారు.

అన్నపూర్ణ ఇకా సహించలేక—"క్షమించవూ? ఏం చేస్తావేమిటి? ఉరి శిక్షవేస్తావా?" అని అన్నది.

నిప్పులో నేయిపడ్డని "అదే మీకు తగిన శిక్ష" అని బిందువాసిని తుపాకల్లే మోతలు పెట్టింది.

"నాకొడుక్కు నేను రెండురూపాయ లిచ్చుకున్నాను, ఇదేకదా నాతప్పు?" అని అన్నపూర్ణ అన్నది.

మాటమీద ఇంకోకమాట రావడంవల్ల బిందువాసిని అసలుమాట మరచి పోయి "ఆ రెండు రూపాయలేనాయిని. పాడుచేయడానికి డబ్బెక్కడినుంచి వస్తుందనుకున్నారు" అని అన్నది.

"డబ్బునీవు పాడుచేయడం లేదూ?"అని అన్నది.

"నాడబ్బునేను పాడుచేసుకుంటున్నాను సరే కాని మీ రెవరి డబ్బు పాడు చేస్తున్నారో కొంచెం చెప్పండి" అని బిందు అన్నది.

ఈమాటకు అన్నపూర్ణకు వచ్చిన కోపం చూస్తే భయం వేసిపోతోంది. ఆమె పేదయింటినుంచి వచ్చింది, బిందువాసిని తనను ఈమాటే ఎత్తిపొడి చిందని అనుకుని లేచి నిలుచుని "నీవు మహా అయినావులేద్దూ భాగ్యవంతుల పిల్లవ్! అల్లా అని మరియెవళ్లూ తమ పిల్లలకు రెండు రూపాయ లిచ్చుకో లేరని అహంకారవడకు!" అని అన్నది.

"నాకా అహంకారం లేదు. అయితే ఒకపైసా అయినాఇస్తే ఆపైసా యెవరిదో అదిగూడా మీరాలోచించు కోండి" అని బిందు అన్నది.

"ఏమిటే? ఆపైసా యెవరిదో అనా? నోటికొచ్చినట్లల్లా పేలితే సరే, పో ఆతలికి పో, నాయెదుటనుంచి" అని అన్నపూర్ణ అన్నది.

"ఆతలికి? ఈ ఒక్కరాత్రీ పోంగానే పోతానుకాని మీ రెవరి డబ్బు ఖర్చు పెట్టుతున్నారో మీకు తెలియదేం? ఎవరి సంపాదనమీద మీరు బతుకుతున్నారో ఆమాత్రం తెలియదేం?"అని బిందునోరుజార్చి కిమ్మనకుండా ఊరుకుంది.

అన్నపూర్ణ మొహం సున్నంకొట్టిన ట్టయింది. క్షణకాలం ఆమె తోడికోడలి మొహంకేసి రెప్పవాల్చకుండా చూచి "మేము మీవారి సంపాదనమీద బతుకుతున్నామనీ, నేను దాసీదాన్ననీ, వారు మీకు నౌక రనీ కదా నీ అభిప్రాయం? ఇన్నాళ్ళనుంచీ ఈమాట చెప్పావ్ కావేం?" అని అన్నది.

అన్నపూర్ణ పెదవులు మాటిమాటికీ వణికెయ్. ఆమె పెదవులు పంటితో నొక్కిపెట్టి ఒక నిమిషంసేపు ఆగి "తమ్ముడికోసం నీ బావగారు ఒక్కసారిగా రెండుబట్టలు కొనుక్కోజాలనప్పుడు నీ వెక్కడున్నావమ్మా తోడు కోడలా? ఇల్లు తగులడిపోగా చెట్టుక్రింద అన్నం వండుకునితింటూ మళ్ళా ఈయిల్లుకట్టించినప్పుడు నీ వెక్కడున్నావమ్మా చెల్లీ?" అని అంటూఅంటూ వుండగా కళ్ళనుండి జరజర జారిన నీళ్ళు తుడుచుకుని మళ్లా "నీ మనస్సులోమాట వారికి గనుక తెలిసివుంటే ఇల్లా నల్లమందు భాయీ ఐ, తూగుతూ, తూలుతూ కాలం గడిపే మనిషి ఆయనకాదు. ఆయనసంగతి మీవారికి తెలుసు: ఆకాశంలోవున్న దేవతలకు తెలుసు. నన్ను అడ్డం పెట్టుకుని వారిని అవమాన పరుస్తావా?" అని అన్నది.

మగనిమీద ఉండే అభిమానంచేత అన్నపూర్ణ వక్షం ఉబికుబికిపడడం మొదలు పెట్టింది. "నీవు నీ ఉద్దేశం ,తెలపడం మంచిదే అయింది. దక్షుడు తన మగనిని అవమానం చేయగా సతీదేవి ఆత్మహత్య చేసుకుంది. నేను, నీ

అన్నం తినడంకంటె ఒకళ్ళ యింట్లో వంటచేసుకు బతుకుతాను. ఇదే ఒట్టు. నీవు వారికి అవమానం చేస్తావుకాదూ?" అని అన్నది.

సరిగ్గా ఆసమయంలో యాదవుడు ముంగిట్లోకివచ్చి, "ఓయ్" అని భార్యను పిలిచాడు. మగని కంఠస్వరం వినేసరికల్లా అన్నపూర్ణ అభిమానం తుపానుచే రేగిన సముద్రంలాగా తాడెత్తున పెరిగింది. ఆమె గబగబా వాకిట్లోకి వచ్చి "ఛీఛీ. ఆలుబిడ్డలను పోషించలేని మనిషికి ఉరిపోసుకు చావడానికెక్కడేనా కసింత తాడు దొరక్కపోయిందా?" అని అన్నది.

యాదవుడి కేమీ తెలియలేదు. 'ఏమిటదీ'? అని అన్నాడు.

"ఏమిటా? ఏమిటీ లేదు. నేను తన దాసీ దాన్ననీ, మీరు తన నవుకర్లనీ తోడుకోడలివ్వాళ స్పష్టంగా చెప్పేసింది."

ఇంట్లోపల ఉన్న బిందువాసిని నాలుక కొరుకుకొని చెవులలో వేళ్ళు గుచ్చుకుంది.

అన్నపూర్ణ యేడుస్తూ యేడుస్తూ "చేయెత్తి ఒక పైసా యెవరికీ యిచ్చే అధికారం నాకులేదు.—మీరు బతికున్నప్పటికీ నేడు నే నీ మాట వినవలసొచ్చింది. ఇదిగో ఇప్పుడు నేను మీయెదుట నుంచొని శపథం చేస్తున్నాను. ఇవ్వాళనుంచీ వారి అన్నం గనుక నేనుతింటే అనంతుడిమీ దొట్టు!" అని అన్నది.

మూసుకొన్న బిందు చెవులలో ఈ మాటలు అస్పష్టంగా ప్రవేశించెయ్. బిందువాసిని "ఎంత ఒట్టు పెట్టుకున్నావమ్మా అక్కా" అని అస్ఫుటంగాఅంటూ, పన్నెండేళ్ల తరువాత మళ్ళా ఈరోజున మూర్ఛవచ్చి విరుచుకు పడిపోయింది.

# ౭

యాదవుడూ, అన్నపూర్ణా, అనంతమూ తప్ప తతిమ్మా వాళ్ళంతా కొత్తమేడలోకి వచ్చేశారు. పొరుగూళ్లనుంచి బిందుపినతల్లి, పినతల్లికూతురూ, ఆమె సంతానమూన్నూ, పుట్టింటినుంచి తలిదండ్రులూ వారి నవుకర్లూ చాకర్లూన్నూ వచ్చారు. మేడంతా జనంతో కిటకిటలాడిపోతూంది. ఈమేడలోకి వచ్చేరోజున బిందుకవళిక బాగుండలేదుగాని ,మరునాటినుంచీ మళ్ళా బాగానేఉంది. కోపం చల్లారిపోగానే అన్నపూర్ణ వస్తుందని బిందువాసినికి గట్టి నమ్మకం. ఈమేడలో గృహదేవతలను పూజించి సంతర్పణ చేయవలసి ఉంది. కాబట్టి బిందువాసిని ఆప్రయత్నంలో మునిగిఉంది.

"అమ్మాయీ, నీకొడుకు కనబడడం లేదేమే!" అని బిందుతండ్రి అడిగాడు.

"ఆయింట్లో ఉన్నాడు" అని బిందు సంక్షేపించింది.

"రావటానికి ఇంకా తీరక కాలేదుకాబోలు మీతోడుకోడలికి" అని తల్లి అన్నది.

"ఊఁహుఁ" అని బిందు అన్నది.

అప్పుడు ఆమెతల్లే ఇల్లా వివరించింది. "పోనులే. అందరూ లేచొస్తే అక్కడుండే దెవరు? తాతతండ్రులు సంపాయించిన ఇంటిని మూసిపెట్టడం కూడా మంచిది కాదు."

బిందువాసిని మాటాడక పనిమీద వెళ్లిపోయింది.

యాదవుడు ప్రతిరోజూ సాయంకాలప్పూట ఈ కొత్తమేడకు వచ్చి వాళ్ళట్లో కూచుని అందరిసమాచారమూ కనుక్కొని వెళుతున్నారు. కాని లోప

లికి మాత్రం అడుగుపెట్టడం లేదు. గృహప్రవేశం జరిగిన రోజు పూజ చేసిన పూర్వరాత్రి ఆత డింట్లోకి వెళ్ళి వేణమ్మను పిలిచి యోగక్షేమా లడిగాడు. అప్పుడు బిందువాసిని చాటుగా నిలుచుని విన్నది. బావగా రంటే ఆమెకు తండ్రికంటె ఎక్కువ. ఆయన తన నెప్పుడూ 'అమ్మా' అని పిలిచేవాడేకాని 'మరదలా' అని పిలిచి యెరగడు. తనకూ తోడుకోడలికీ మాటా మాటా పెరిగినప్పుడు ఆమాట పట్టుకుని తా నెన్నిసార్లో ఆయన ముందుకు వెళ్ళింది. తాను మోసుకుని వెళ్ళిన మాట నెన్నడూ ఆయన కాదనలేదు. అటువంటాయన ముందుకువెళ్ళ డానికి బిందువాసిని యీనాడు జంకిపోయింది. ఆమెగొంతుక బిగిసిపోయింది, యీదవుడు వెళ్ళిపోయాడు. ఎక్కడ చూచినా జనం ఉండటంచేత ఆమె చాటుగా గదిలోకి వెళ్ళి నోట్లో కొంగు కుక్కుకుని వెక్కివెక్కి యేడ్చింది.

మరునాడు పొద్దున బిందువాసిని మగనిని పిలిపించుకొని "పొద్దెక్కింది. వసిష్ఠు కనిపెట్టుకుని కూచున్నాడు. బావగా రింకా వచ్చారు కారు" అని అన్నది.

"ఆయ నెందుకూ?" అని మాధవుడు వింతగా అడిగాడు.

"ఆయ నెందుకంటా రేమిటి? ఆయనకాక ఇదంతా మరెవరు చేస్తారు?" అని బిందువాసిని అంతకంటె వింతగా అన్నది.

"చేస్తే నేను చేస్తాను, లేకపోతే బావ పేరిశాస్త్రుల్లు చేస్తాడు అన్నగారు రారు" అని మాధవుడన్నాడు.

బిందుకు కోపం వచ్చింది. ఇల్లా అన్నది. "రారంటే అయిపోయిందా యేమిటి? ఆయన ఉండంగా మరెవరికయినా ఇక్కడ అధికారం ఉందా? తీసేయండామాటలన్నీ. ఆయ నుండగా మరొకరిని ఇందులో నేను వేలు పెట్ట నివ్వను."

"అయితే ఈపనులన్నీ ఆపెయ్, అయిన ఇంట్లోలేడు, ఏదో పని మీద వెళ్ళాడు. అని మాధవుడన్నాడు.

"ఇదంతా తోడుకోడలిగారి యెత్తు. అలాగైతే ఆవిడకూడా రానట్టు కనబడుతుంది" అని బిందువాసిని కళ్ళనీళ్ళతో వెళ్లిపోయింది. ఇప్పుడామెకి పూజా, పురస్కారమూ, సంతర్పణమూ సకలమూ వృథాగా కనపడ్డది. "నేడు బావగారొస్తారు అక్క వస్తుంది. అనంతం వస్తా" డని మూన్నాళ్ల నుంచీ ప్రతిరోజూ అనుకుంటూంది. వాళ్లు తప్పకుండా వస్తారనే ధైర్యంమీదనే ఇన్నాళ్లనుంచీ ప్రొద్దుటినుంచీ సాయంకాలం దాకా పనిపాటలు చేసుకుంటూంది. ఇప్పుడు మాధవుడు పలికిన ఒక్కమాటతో ఆధైర్యమంతా ఎండ మావులులాగా ఎగిరిపోయింది. దాంతో ఈఉత్సవ సన్నాహమంతా ఆమె గుండెలకు బరువైపోయింది.

వేణమ్మ వచ్చి "ఏమమ్మా, కొట్టుబీగం ఒకసారి ఇయ్యి! మిఠాయివాడు లడ్లు పట్టుకొచ్చి నిలబడి ఉన్నాడు" అని అన్నది.

బిందువు విసువుదలతో "అక్క డెక్కడయినా పెట్టమందురూ! తరువాత చూచుకుందాం" అని అన్నది.

"ఎక్కడ పెడతాం? కాకులు పాడుచెయ్యవూ?" అని వేణమ్మ అన్నది.

"పాడుచేస్తే పాడుచేసెయ్. అక్కడ పడేసి పొమ్మనండి" అని బిందు అన్నది

పినతల్లి "అమ్మా బిందూ! ఈనాటికి ఎంత మైదాపిండి పట్టుతుందో కొంచెం చూపిపోతావూ" అని అడిగింది.

బిందువాసిని మొహం భారగించుకుని "ఎంత కావాలో నాకేం తెలుస్తుంది? చేసినవాళ్లు మీా రెరగరుటమ్మా?" అని అన్నది.

పినతల్లి ఆశ్చర్యపడి "ఇదేమిటే? ఎంతమందిని పిలిచావో ఆసంగతి నాకేం తెలుస్తుంది?" అని అన్నది.

బిందువాసిని కోపగించుకుని "అలాగయితే పోయి ఆయన నడుగు! నీవు మా అక్కగారి పనిచూచి ఉండవలసింది. అనంతుడికి వదుగైనప్పుడు మూడురోజులూ ఊరంతా ఇక్కడే భోజనం. అప్పుడుకూడా ఆమె 'ఇదెంత కావాలి, అదెంతకావాలి, ఈపని చూడు, ఆపనిచూడు,' అని ఎన్నడూ నాకొక్కమాట కూడా చెప్పలా. ఈయింట్లో వాళ్లందరూ కలిసినా ఆమె వేలికి పోలరు" అని మరో గదిలోకి వెళ్లిపోయింది.

కదంబ వచ్చి "అమ్మా! అయ్యగారు పూజా వస్త్రాలు——"అని అంటూ ఉండంగా దాని మాట సాగనీయక బిందువాసిని "నన్ను మీరందరూ కలిసి పిరుచుకు తినండి. పో, నా యెదుటనుంచి ఆవలికి పో" అని కసురుకుంది, అది కుందేలులాగా పారిపోయింది.

మరి కాసేపటికి మాధవుడు వచ్చి పిలుపుమీద పిలుపుగా పిలిచి "ఓయ్! వినబడటం లేదా?" అని అన్నాడు.

బిందు దగ్గిరి కొచ్చి "వినబడటం లేదు. నా చేత కాదిహ నా చేత కాదు. ఊఁ, అయిందా?" అని ఝూంకరించింది.

మాధవుడు మరి మాట రాక చూస్తూ నిలబడ్డాడు.

"మీరు నన్నేం చేస్తారు మహా? మెడ కురిపోస్తారా? పోనీ పొయ్యండీ" అని బిందువాసిని యేడస్తూ వడివడిగా ఆవలకి దాటుకుపోయింది.

క్రమ క్రమంగా ప్రొద్దెక్కింది. బిందువాసిని పని యేమీ లేకపోయినా తీరిక లేకుండా ఆగదీ ఈగదీ తిరగవెయ్యడం ఇతరుల లోపాలు పట్టుకొని గందరగోళం చేయడం మొదలుపెట్టింది. ఎవరో తొందరమీద కొన్ని గిన్నెలు నడిచే దార్లో పెట్టారు. బిందువాసిని దొడ్లో పోయిపడేటట్లు వాట్లనొక తాపు తన్ని వాట్ల నెక్కడ పెట్టాలో బోధించింది. అందరూ తిరిగేచోట ఎవరో బట్ట లారవేశారు. అవి బిందువాసిని కాలికి చుట్టుకొన్నాయ్. ఆమె వానిని

చింపిపారేసి ఎక్కడ అరగట్టాలో చూపించింది. ఆమె కెదురుపడ్డ వాళ్లం దరూ భయంతో పక్కగా తప్పుకుని నిలబడిపోతున్నారు.

పాపం, వసిష్ఠ లోపలికి వెళ్లి "ఇదేమిటి ? పొద్దెక్కిపోతూంది. ఇక్కడ ఇంకా సంస్కారం ఏమీచేశారు కారేం?" అని అన్నాడు.

బిందువాసిని చాటున నిలబడి "కార్యంపట్ల కొంచెం ఆలస్యం కాక మానుతుందా?" అని గాటంగా జవాబు చెప్పి, అక్కడ ఒక పళ్లెం ఉండంగా దాన్ని కాలికొద్దీ తన్ని మరొక గదిలోకి పోయి చైతన్యం లేని దాని చందంగా పడిఉంది. అయిదారు నిమిషాలలో లోగడ ఆమె కలవాటయిన కంఠధ్వని ఒకటి వినబడగానే గబగబాలేచి నిలబడి తలుపుసందునుంచి అర్రుచాచి చూచింది. అన్నపూర్ణ వచ్చి మెల్లలో నిలబడ్డది.

బిందువాసిని దుఃఖంతోటి, అభిమానంతోటీ యేడ్చేసి కళ్లు తుడుచు కుని చప్పుడు చేసుకుంటూ ముందుకొచ్చి గళవస్త్రం వేసుకుని చేతులుజోడించి "పది పదకొండు కావచ్చింది. ఇంకా ఎంత శత్రుత్వం పెట్టుకుంటావమ్మా ? నీకు గనుక కోరికైతే నేను విషముచ్చుకుంటాను. లేకపోతే ఇంటికి పోయి ఒక గిన్నెడు పంపించు" అని తాళంచెవులగుత్తి ఆమె పాదాలముందు గణగణా మోగేట్టు పడేసి తన గదిలోకి పోయి తలుపువేసుకుని నేలమీద పొరలుతూ ఏడవడం మొదలు పెట్టింది.

అన్నపూర్ణ యేమీ మాటాడకుండా తాళపుచెవులగుత్తి తీసుకుని వెళ్లి కొట్టు తలుపులు తెరిచి అందులో ప్రవేశించింది.

అందరి భోజనాలూ అయినవి. రాకపోకలు ఉడిగినవి. అపరాహ్ణం అయింది. అయినా బిందువాసిని తీరికలేకుండా ఆతలుపూ ఈ తలుపూ తెరచి తిరుగుతూనేఉంది. "అనంతబాబు ఇస్కూలులో లే"దని భైరవుడొచ్చి చెప్పాడు.

బిందువాసిని భైరవుడిమీద నిప్పులు కురిపించి "దౌర్భాగ్యుడా! పిల్లలు రాత్రివేళ బళ్లో ఉంటారా? నీ కిదేం కొత్తా ? అయింట్లోకి పోయి ఒకసారి చూచి రాకపోయావ్?" అని అన్నది.

"వెళ్లానండీ! అక్కడగూడా లేరు"

"అల్లా అయితే అత నెక్కడో వీధపంతో కుండబంతి ఆడుతూ ఉండాలె. అతనికి భయమూ భక్తీ పోయినయ్. ఈసారి ఈపాడుఆటలో ఒక కన్నెగిరిపోతే అన్నపూర్ణమ్మగారి కోరిక సిద్ధిస్తుంది.అప్పుడు కడుపునిండా అన్నం తింటుంది. పో, ఎక్కడున్నాడో వెతుక్కోరా"

అన్నపూర్ణ కొట్టుగడప లోపలపక్క కూచుని ఇంట్లో వున్న పెద్ద ముత్తయిదువులతో మాట్లాడుతూ తోడుకోడలి కరుకుమాటలు విన్నది.

ఒకగంటకు భైరవుడొచ్చి "అనంతబాబు ఇంటి కొచ్చారుగాని యిక్కడికి రానన్నారు" అని అన్నాడు.

బిందు నమ్మలేదు. "రానన్నాడు రా? నేను రమ్మన్నానని చెప్పావా?" అని బిందు అడిగింది.

భైరవుడు తల తిప్పి "ఆఁ. చెప్పానండీ! మరిగత్తే చెప్పినాకాని రానంటున్నారండీ" అని అన్నాడు.

బిందు ఒక నిమిషంపాటు ఊరుకుని "ఇది అతని తప్పు కాదు. తల్లిచార పిల్లకు రాకపోదు, నే నిహ పిల్లిద్దరి మొహం చూస్తే వొట్టు" అని అన్నది.

రాత్రి చాలా పొద్దుపోయింది. అన్నపూర్ణ ఇంటికి వెళ్లడానికి లేచింది. మాధవుడు పంపించి రావడానికి స్వయంగా వచ్చాడు. బిందువాసిని గబగబా వచ్చి మగని నుద్దేశించి భయంకరమైన స్వరంతో "పంపించి రావడానికైతే బయలు దేరారు. ఆవిడె ఇంతవరకు మంచినీళ్లయినా ముట్టకో లేదు. ఈసంగతి మీకు తెలుసా?" అని అన్నది.

"ఆసంగతి తెలియవలసింది నీకు. నాకెట్లా తెలుస్తుంది? ఇక్కడ ఇవ్వాళ ఏపనీ జరగక ఇల్లా ఆభాసు అయిపోతుంటే నేనే పోయి పిలుచుకొచ్చాను. ఇప్పుడు మళ్లా నేనే దిగబెట్టి రాబోతున్నాను" అని మాధవుడన్నాడు.

"ఓహో, బహు బాగా వుంది. అలాగయితే మీరుగూడా వారి పక్షమే నన్నమాట" అని బిందు అన్నది.

మాధవుడిందుకు జవాబు చెప్పక "మరి జాగు చేయకండి, పదండి" అని వదినగారితో అన్నాడు.

'పదండి' అని అన్నపూర్ణ రెండడుగులు వేయగానే బిందువాసిని "జ్ఞాతి శత్రుత్వం! నోటికొచ్చినట్లు ఫది కల్పించి చెప్పితే సరి పుసపుసా ఒట్లు పెట్టుకుంటే సరి. నాలుగు పగళ్లు, నాలుగు రాత్రులు కుర్రాడి మొహాం చూడనిచ్చిందికాదు. దేముడిందుకు సరిగ్గా చూడక మానడు" అని గర్జించి నోట్లో కొంగు కుక్కుకుని ఏడుపు నాపుకుని వంటింటి వరాండాలోకి పోయి కుప్పున కూలబడి మూర్ఛపోయింది. నలుగురూ చేరారు. ఈ గడిబిడ విని అన్నపూర్ణ వెనక్కి తిరిగి "ఏమిటో చూదాంపదండి" అని అన్నది.

"చూడక్కరలేదు పదండి" అని మాధవుడన్నాడు.

తోడుకోడళ్ల పోట్లాట ఇన్నాళ్లా చాటు చాటుగా ఉందిగాని ఇప్పుడు బయట బడ్డవి. మరురోజు ఆడంగులంతా ఒకచోట కూచున్నసమయంలో వేణమ్మ "తోడుకోడళ్లు పోట్లాడుకుంటే పోట్లాడుకున్నారు; కుర్రాడికేం? ఒక్కసారి చూచిపోతే ఏం పాపొ? తల్లిచార పిల్ల కొస్తుందని బిందు అన్నమాట వట్టిమాట కాదు, నేనెందరి పిల్లలనో చూచానుగాని, రామరామా! ఇలాటి విశ్వాసఘాతకుణ్ణి ఎక్కడా చూడలేదు" అని అన్నది.

బిందువాసిని విసుకుదలగా వేణమ్మను ఒక్కసారి చూచి సిగ్గుతో, ఈసుతో తలవంచుకుంది. వేణమ్మ మళ్ళా ఇల్లా అంది; "బిందూ! నీకుపిల్లలంటే

మహాప్రేమ. మా నరహరిని తీసుకో! కావాలంటే ఇచ్చేస్తా. చంపివెయ్, నరికివెయ్, ఏమయినాచెయ్. ఏమీ అనే రకంకాదు. అలా అనేవాళ్ళు నాకడుపున పుట్టరు," బిందువాసిని మాట్లాడకుండా కూచుంది. ఆమెతల్లి వేణమ్మకు జవాబు చెప్పింది. ఆమె యేండ్లు చెల్లిన మనిషి. ధనికుల యింటి పడుచు. ధనికులయింటి కోడలు. ముక్కాకలు తీరినది. ఇట్టి బిందు తల్లి చిరునవ్వు నవ్వి. "ఏమిటీ గందరగోళ మంతా? అనంతం దాని రక్తమాంసాలతో కలిసి పోయుంన్నాడు. దాన్నల్లా గందరగోళం చేయకండి! బిందూ! మీకోపాలుంటే మహా ఒక రోజు రెండురోజులు! ఇంత మాత్రంచేతనే కుర్రాడు నీకు వేరై పోతాడా యేమిటి? అని అన్నది.

బిందువాసిని కన్నీటితో కలకలలాడుతూ తల్లికేసి చూసి మెదలక కూచుని ఊరుకుంది. సంధ్యాసమయంలో ఆమె కదంబను పిలిచి "పోనీ నీవే చెప్పు నీవుకూడా ఉంటివికదా. ఆవిడె ఇంత వొట్టేసు కునేందుకు తగినంత తప్పు నాదేమయినా వుందా?" అని అడిగింది.

ఈయాలోచన చేయడానికి తనను పిలిచిందని కదంబ నమ్మలేక చాలా సంకూచంతో మౌనంగా ఊరుకుంది. అలా ఊరుకున్న బిందువాసిని "మీరందరూ ఎలాగయినా కాని వయస్సుకు పెద్దవాళ్లు కదా! మీ అభిప్రాయంకూడా నేను వినాలి. ఇందులో ఇంత తప్పు నాదేమైనా ఉందా చెప్పు" అని అన్నది.

కదంబ తలతిప్పి "ఇందులో మీతప్పేమిటి?" అని అనేసరికి బిందు "అలాగయితే నీవొకసారి ఆయింటికి పోయి చక్కగా రెండుమాటలు అని రారాదూ? నీకేం భయం?" అని అన్నది.

కదంబకు సాహసం వచ్చింది.—"భయమేమిటిగాని, మరి వాదం పెట్టుకుని ఏం లాభం దొరసానిగారూ? కావలసిందేమో ఆయేపోయె" అని అన్నది.

"అలా కాదే కదంబా! నీకు తెలియదుగాని అయితే నిజం చెప్ప య్యటం మంచిది. అలాకాకపోతే తప్పంతా నాదే అయినట్టూ తన దేమీ లేనట్టు అనుకున్నపోతుంది. నిన్ను గెంటేస్తాను, తరిమేస్తాను, అని అర్థం వచ్చే మాటలు ఆమె యెన్నడూ అనలేదు? ఇల్లా అంటేనే నెప్పుడయినా కోపగించు కున్నానా? నాకు తెలియకుండా రూపాయ లెందుకివ్వాలి? పోనీ నా కెం దుకు చెప్పకపోవాలీ?"

"ఔను, మంచిది, ఇవ్వాళ చీకటడిపోయిందిగాని రేపుపొద్దున పోతాను."

బిందువాసిని అసంతుష్టితో "అప్పుడే చీకటేమిటే కదంబా? నీవు పెద్దమాటలు అంటున్నావ్. శీతాకాలం కాబట్టి కాస్త పొద్దూకినట్టు కన పడ్డది,పోనీ ఎవడి నయినా తోడుతీసుకుని పోరాదూ? ఒరే భైరవా! ఇదిగో! ఉళక్కిని పిలూ! కదంబతో వెళ్లాలి" అని అన్నది.

"అయ్యగారు ఉళక్కిగాడిచేత లాంతర్లు తుడిపిస్తున్నారండీ" అని భైరవు డన్నాడు. బిందువాసిని కోరచూపు చూచి "పొగరుబోతు జవాబు చెబుతావేం?" అని అన్నది. భైరవు డామెచూపుల కాకకు అక్కడినుంచి పారిపోయాడు. బింది కదంబను పంపేసి రెండుమూడుసార్లు అగదీ ఈగదీ తిరిగి తుదకు వంటింట్లోకి వెళ్లింది. వంటలక్క ఒకమూల వంట చేస్తున్నది. బిందు ఆమెదగ్గర కూచుని "ఇదిగో కాత్యాయనీ! నేను నిన్నే సాక్షిగా కోరుకుంటా. నిజం చెప్పు మాయిద్దరిలో ఎవరి దెక్కువ తప్పు?" అని అన్నది.

కాత్యాయని కేమీ తెలియలేదు. "ఏమాటమ్మా అదీ" అని అన్నది.

బిందు "ఆనాటి ముచ్చట. నే నేమన్నా? అనంతాని " కీనడుమ ఏమయినా డబ్బిచ్చావా అని అన్నా. పిల్లలకు డబ్బిస్తా రనేమాట ఎవరికి తెలియదు? 'అనంతం ఏడిచాడు; ఏడిస్తే ఇచ్చాను' అని చెప్పేస్తే సరి

పోతేంది. ఆలాగయితే ఇంతకథ పెరక్కపోను, ఈ ఒట్లూ సొట్లూ లేకుండా పోను, మన మేం గిన్నెలం గనుకనా కొట్టుకుంటే కంగ్ మనేందుకు? మనుష్యులమాయెరి. అంత ఒట్టు పెట్టుకోడానికి ఏ మవసరమొచ్చింది? వంశానికంతా అత డొక్కడే అంకురం. అతడిమీద ఒట్టా? ఇదిగోనమ్మా కాత్యాయనీ! ఇహా నేను బతికుండంగా ఆవిడె మొహాం చూడను. పరమ శత్రువునయినా పోయి చూస్తాకాని ఇహా అటుకేసి మొహాం పెట్టను'' అని అన్నది,

కాత్యాయని స్వతహాగా అట్టే మాటాడే స్వభావం కలది కాదు. ఇప్పుడేమి చెప్పాలో తెలియక మౌనం వహించింది. బిందుకళ్లు రెండూ నీళ్ల తో నిండెయ్. గబగబ తుడుచుకుని దుఃఖస్వరంతో మళ్లా "కోపం వెచ్చరిల్లి నప్పుడు ఎవరైనా వొట్టెట్టుకుంటారుకాని అదే పట్టుకూర్చుంటారా? ఇంటికి వచ్చికూడా పురిష్కడునీళ్లు పుచ్చుకోలేదే! ఆఖరికి కుర్రాణ్ణాయినా పంపింది కాదే? ఇది పెద్దలు చేసే పనేనా? నిజానికి నిజమే చెప్పాలి. నే నావిడకన్న చిన్న దాన్నే. నాకు ఆమెకన్న బుద్ధి తక్కువే, అయితే నేనే ఆవిడె కూతురునై యుంటాననుకోండి, అప్పుడేమిచేసేదో? నేనుకూడా ఇహా ఆలాగే ఆవిడె పేరయినా నాలుకమీదికి రానీయను "మీరు చూస్తూ ఉండండి" అని అన్నది.

ఇల్లా అన్నా వంటలక్క మాటాడక కూరుకుంది. బిందు "అవిడొక్కే మహా ఒట్టేసుకోడం తెలుసా? మరి నాకు తెలియదనుకుందేమో! నేనూ లే పాయింటికి వెళ్లి 'నీ వొగిన్నెడు విషంపంపకపోతే నీవు పెట్టుకొన్న ఒట్టేస'ని వొట్టుపెట్టివాస్తే ఏమవుతుంది? నే నీ రెన్నాళ్లు చూస్తూచూస్తూ ఉన్నాగాని రేపుపోయి ఈఓట్టయినా పెట్టొస్తా, లేకపోతే మాటాడకుండా విషం మింగి ఊరుకుని, అక్కయ్యే పంపిందని నలుగురితో యాగీచేస్తా, నలుగురూ ఆవెణ్ణి చీచీ అంటారో లేదో అప్పుడు చూస్తా దాంతో ఆవిడె లొంగిరాకపోతే చూచుకోండి." అని అన్నది.

కాత్యాయని భయపడి మెత్తగా ఇలా అన్నది: "ఎబ్బె, ఇవేం మాట లండీ! తలపనయినా తలపరాదు. పోట్లాటలు చిరకాలం ఉండవ్. వారు కూడా మిమ్మల్ని వదిలిపెట్టి ఉండలేరు. అబ్బాయి అంతకంటె ఉండలేడు. ఈ నాలుగురోజులనుంచీ ఎల్లా ఉంటున్నాడో కాని మాకందరికీ చాలా ఆశ్చర్యంగా ఉంది" అని అన్నది.

"అల్లా చెప్పండి కాత్యాయనమ్మగారూ, అల్లాచెప్పండి! నిజంగా ఆవిడే అతణ్ణి కొట్టి కోసి భయపెట్టి బంధించేసింది. అతడు నాదగ్గరగాని ఇంకోదగ్గర పడుకోలేడు. ఈలా అయిదుపగళ్లు, నాలుగురాత్రులు వెళ్లేయ్. ఇహ ఆవిడ గారి మొహం చూడవలసిన పని ఉందా? పరమ శత్రువు మొహమయినా చూడ గలను గాని ఇహ ఆవిడెగారిమొహం ఈజన్మలో చూడ దలచుకోలేదని చెప్పనే చెప్పాను" అని తొందరగా బిందు అన్నది.

కాత్యాయని తన మనికట్టుమీద ఒక నల్ల మచ్చచూపి "ఇదిగో చూడమా! ఇక్కడ ఇంకా నలుపుపోలేదు. ఆరాత్రి మీకు మూర్ఛ వచ్చింది. ఈసంగతులన్నీ మీకు తెలియవు. అబ్బాయి ఎక్కణ్ణుంచో పరుగెత్తుకొని వచ్చి మీమీద పడి ఆనాడేడ్చిన యేడ్పా? మీకు మూర్ఛరాంగా ఆయన ఎప్పుడూ చూడలేదుకాదూ, 'మా అమ్మ పోయింది. మా అమ్మ పోయింది' అని ఒకటే ఏడుపు. మీమొహం మీద నీళ్లు కొట్టనివ్వలేదు. విసరనివ్వలేదు. నే నీతలికి లాగాను. అపళంగా నన్నిక్కడ కరచి పెట్టాడు. పెద్దమ్మగారు లాగారు. ఆవిడెబట్ట అందుకుని పీలికలు పీలికలు చేసి పారేశాడు. మిమ్మన్ని వదిలేసి ఆయన్ను సద్దుబాటు చేయవలసి వొచ్చిం దందరికీ. చిట్ట చివరకి నలుగురయిదుగురు కలిసి ఆయన్ను అవతలికి లాక్కెళ్లారు" అని అన్నది.

బిందువాసిని ఆమాటలు మింగుతున్న చందంగా రెప్ప వాల్పకుండా కాత్యాయని మొహం చూస్తూ కొంతసేపటికి నిట్టూర్చి మెల్లగా లేచి గది లోకి వెళ్లి పడుకుంది.

నాలుగురోజులు గడిచినయ్ బిందు తలిదండ్రులూ, బంధువులూ ఇహ రేపు వెళతారనగా బిందుకు మూర్ఛ వచ్చి కొంతసేపటికి తేరుకుంది. ఆమె మెదలకుండా పక్కమీద పడుకుని వుండగా కదంబ విసనకర్రతో విసురు తూంది. అక్కడ మరియెవరూ లేరు. అది చూచి బిందు కదంబను దగ్గరకు రమ్మని సైగచేసి "అక్కయ్య వచ్చిందా" అని మెల్లగా అడిగింది.

"లేదండీ అమ్మగారూ? మే మింతమంది ఇక్కడుండగా ఆమెగారిని కష్టపెట్టడం ఎందుకూ?" అని కదంబ అన్నది.

బిందు కొంచెంసేపూరకుని "మీలో వున్న లోటేఇది. అన్నిపనుల లోను మీ తెలివితేటలు ఉపయోగిస్తారు. ఈలాగే చేస్తూ నన్నెప్పుడో చంపే సేస్తారనుకుంటా. గృహప్రవేశంనాడుకూడా మీ రింటినిండా ఇంతేడు జన మున్నారు ఆ జేనెడుమనిషీ ఇంట్లో అడుగు పెట్టనంతవరకూ మీరేమి చేయగలిగారు? 'ఓ, మీరిక్కడ, ఆవి డెక్కడ? మీరందరూ కలిసినా ఆవిడ చిటికెనవేలికి పోలరు" అని అన్నది.

బిందుతల్లి గదిలోకి వచ్చి "అమ్మాయీ, అల్లుడుగారి సెలవయింది. కొన్నిరోజులపాటు మాతో ఉండొద్దుగాని పద" అని అన్నది.

బిందు తల్లి మోహంకేసి చూస్తూ "నేను వెళ్లడమూ, వెళ్ళకపోవడమూ వారి యిష్టానిష్టాలని పట్టుకునేఉందా యేమిటి? వారు వెళ్ళమనంగానే వెళ్లానా యేమిటి? నాశత్రువు ఆజ్ఞలేనిదే నే నెట్లా కదలడం?" అని అన్నది.

"సీతోడుకోడలి మాటా? ఇంకా ఆమె ఆజ్ఞఎందుకు నీకు? మీరు విడిపోయి ఎప్పుడు వచ్చేశారో అప్పుడే ఆవిడతో పని తీరిపోయింది. ఇప్పుడు మీవారి ఆజ్ఞ అయితేచాలు" అని తల్లి అన్నది.

బిందువాసిని తల ఆడించి "కాదమ్మా అల్లాకాదు ఆమె బతికున్నంత వరకూ ఎక్కడయినా ఉండనీ, ఆమే సమస్తమూ, ఎన్ని చెప్పినా ఆవిడే ఆజ్ఞ

లేనిదే నే నీయిల్లొదిలేది లేదు—అలాగయితే బావగారు నొచ్చుకుంటారు”
అని అన్నది.

అంతలో వేణమ్మ అక్కడికి వచ్చి సంగతంతా విని “మంచిది. నేను చెపుతున్నా కాని నీవు వెళ్లు” అని అన్నది.

బిందు ఆమెకు ప్రత్యుత్తరమయినా పలుకకపోగా ఆమెతల్లి “సరే కాని, మనిషి నెవరినయినా పంపి ఆమె ఆజ్ఞ తీసుకోరాదా బిందూ?” అని అన్నది.

బిందు ఆశ్చర్యపడి “మనిషిని పంపా? అది మరీ బాగుండదమ్మా! నా కావిడెమనన్ను తెలుసు. పైకి వెళ్లమంటుంది. కాని లోపల్లోపల కోపం పెంచు కూర్చుంటుంది. లేకపోతే బావగారికి నాలుగు కల్పించి చెప్పనయినా చెప్తుతుంది. వద్దమ్మా వద్దు. మీరు వెళ్లండి. నాకు రావడం పడదు” అని అన్నది.

బిందుతల్లి మరి పట్టు పట్టలేదు. ఎవరి ఊళ్ళకు వారు వెళ్లిపోయారు. ఇప్పు డెవరూ లేని యీ పెదమేడంతా తనను మింగ జూస్తున్నట్టుంది. కింద వరస ఒక గదిలో వేణమ్మ ఉంటుంది. పైఅంతస్తులో తనగది. మిగతా మేడంతా బోయిబోయిమంటూ ఖాళీగా ఉంది. బిందు మనస్సు ఎక్కడో పెట్టుకుని అటూ ఇటూ తిరుగుతూ తిరుగుతూ మూడో అంతస్తుమీదికి వెళ్లి ఒక గదితలుపు తెరచింది. ఎప్పుడో భవిష్యత్కాలంలో ఈకొడుకూ కోడలూ ఉంటారని ఉద్దేశించి ఆమె స్వయంగా ఈ అంతస్తుకట్టించింది. ఇక్కడికి వచ్చేసరికి ఆమెకు కన్నీరాగలేదు. ఆమె యిక అక్కడ ఉండ లేక కిందికి దిగవస్తుండంగా మాధవుడు మెట్లెక్కి పయికి వస్తున్నాడు. అప్పు డామె “ఇట్లా అయితే ఎట్లా జరుగుతుంది?” అని అన్నది. మాధవుడు తెలియక “ఎవరికి?” అని అన్నాడు.

బిందు మరి జవాబు చెప్పలేకపోయి హఠాత్తుగా నిట్టూర్చి "ఎవరికీ లేదు లెండి మరేంలేదులెండి." అని అన్నది.

మరునాడు ప్రొద్దున మాధవుడు ఆఫీసుగదిలో కూచుని పనిచేసుకుంటుండగా అకస్మాత్తుగా బిందువాసిని అక్కడికొచ్చేరావడంతోటట్టే "వారు నవుకరీ చేస్తున్నారటనా?" అని అడిగింది.

మాధవుడు తలయెత్తకుండానే 'ఊఁ' అని అన్నాడు.

"ఊఁ యేమిటి? ఇది వారునవుకరీ చేసే వయసేనా?"

మాధవుడు వెనుకటల్లేనే కాకితమ్మీద కళ్ళుంచి "వయస్సునుబట్టి మనుష్యులుద్యోగాలు చేస్తారా యేమిటి ? తిండికి లేకపోతే చేస్తారుగాని" అని అన్నాడు.

"వారికి తిండి కెందుకు లేకపోవాలి? నేనయితే పరాయిదాన్ని మేమూ మేమూ పోట్లాడుకుంటే పోట్లాడుకున్నాం. మీరు మీరు అన్నదమ్ములుకారా?"

"సవతిబిడ్డలం—జ్ఞాతులం."

బిందు స్తంభించిపోయి "మీరు బ్రతికుండంగా వారిచేత, పని చేయిస్తారా?" అని అన్నది.

మాధవుడొక్కసారి తలయెత్తి భార్యనుచూచి తనకు సహజమైన శాంత కంఠంతో "ఏంచేత చేయనియ్యను? సంసారంలో ఎవరి అదృష్టం వారిది. ఎంత పెట్టిపుట్టితే అంత అనుభవించాలి. దానికి నేనే ప్రబల దృష్టాంతం. తలిదండ్రు లెప్పుడు పోయినారో నే నెరగ, మేము చాలా దరిద్రులమని వదినెగారు చెప్పగా విన్నానుకాని నేనుమటుక్కు దుఃఖమంటే యేమిటో కష్టమంటే యేమిటో యెరగను. తెల్లని కట్టుబట్టలూ, చదువులకు జీతమూ, పుస్తకాలకు డబ్బూ, చేతిఖర్చూ ఇదంతా ఎక్కణ్ణుంచి వచ్చేదో

నా కిప్పటికీ ఏమీ తెలియదు. అటుపైని నేను వకీలయాను. డబ్బుకూడా తక్కువ సంపాయించి యెరుగను. ఈనడుంగా నీ వెక్కడినుంచో ఏలాగో ఇంత డబ్బు వెంటబెట్టుకుని ఈయింట్లో కొచ్చావు. ఈపెద్ద మేడకూడా వెలిసింది. అయితే మా అన్నగారి సంగతి: చాలాకాలంనుంచీ విసువనే మాట లేకుండా ఎముకలు విరిగేట్టు పనిచేశారు. మాసికలువేసిన బట్టలు కట్టుకుంటున్నారు. శీతాకాలపు రాత్రిళ్లకూడా ఆయనఒంటిమీద చొక్కాయెన్నడూ చూడలేదు. ఒక్కపూటంటే ఒక్కపూట రెండు మెతుకులు తిని, కేవలం మన కోసం - ఈసంగతులన్నీ నాకు గుర్తులేదు, గుర్తుండవలసిన పనికూడా లేదు కాని - సరే, దానికేం? ఈనడుమ కొన్నాళ్ళమాత్రం సుఖంగా కాలక్షేపం చేశారు. అందుకోసం భగవంతుడు వడ్డీతో కూడా కష్టపుచ్చుకుంటున్నాడు" అని వెంటనే ముఖం తిప్పేసుకుని అవసరమయిన ఒక కాకితం వెతకటం మొదలుపెట్టాడు.

బిందు నోటివెంట మాటరాలేదు. స్తంభంలాగా నిలబడిపోయింది. ఇన్నాళ్లనుంచీ జరుగుతూ వస్తూవున్న ఈకథాకలాపాన్ని గురించి మగని మనస్సులో తిరస్కారం ఎంతగా అణగివుందో ఆ సంగతి బిందువాసిని ప్రతిరక్త బిందువూ ఇప్పుడు తెలుసుకోవడం మొదలుపెట్టింది. ఆమె తలవంచుకుని నిలువబడ్డది.

మాధవుడు కాకితం వెతుకుతూ తనలో తానే అనుకున్నట్లు ఇల్లా అనుకున్నాడు: "ఉద్యోగ మనగా ఉద్యోగమా భలే ఉద్యోగం, కృష్ణాపురం తాణాకూ, ఇక్కడికి రానూపోనూ సుమారు అయిదుకోసులు తెల్లారకట్ట నాలుగంటలకు లేచి పగలల్లా అన్నం లేకుండా ఉండి రాత్రికి తిరిగివచ్చి రెండుమెతుకులు తినటం. జీతమా? పన్నెండురూపాయలు."

బిందుకు కంపరమెత్తి పోయింది. "పగలల్లా అన్నం లేదా? జీతం మొత్తమ్మీద పన్నెండా?" అని అన్నది.

"ఆఁ. పన్నెండు. ఆయన పెద్దవాడయ్యాడు. నల్లమందు వేసుకుం టాడు. తాగడానికి పాలచుక్కయినా లేదు. ఇన్నాళ్ళకు ఆయనమీద దేము డికి దయ వచ్చికుంటుంది; ఇహ కొద్దిరోజులలోనే ఆయన కష్టాలు గట్టెక్కిస్తా డనుకుంటా" అని మాధవు డన్నాడు.

బిందువాసిని కన్నులనుండి నీరు బొటబొటమని జారింది. ఇన్నాళ్ళ నుండి ఎన్నడూ చేయని పని ఒకటి ఇపుడు చేసింది. ఆమె వంగి మగని పాదాలు రెండూ పట్టుకుని ఏడుస్తూ యేడుస్తూ "మిమ్మన్ని బతిమాలుకుం టున్నాను. ఏదో ఒకదారి చూడండి. వారు ఆరోగ్యంగా లేరు. ఇల్లాగయితే రెన్నాళ్లయినా బతకరు" అని అన్నది.

మాధవుడు తన కన్నీళ్ళ నెల్లాగో తుడుచుకుని "నేనేమి దారి చూడను? వదినెగారు మన బియ్యం ఒక్క గింజయినా ముట్టరు. ఇహ ఆయన కష్టపడకపోతే వాళ్ళ సంసారం ఎల్లా వెళ్ళమారుతుంది?" అని అన్నాడు.

"ఆసంగతంతా నా కేమీ తెలియదు. ఇదిగో వినండి: మీకంటే వేరేదైవం నాకు లేదు. బావగా రంటే అంతకంటే ఎక్కువ. ఛీఛీ! తలచ డానికి గూడా వీలులేని——" అని స్వరం కుంటుపడిపోగా బిందు మాటాడ లేకపోయింది.

"మంచిదేకాని ఆఖరుకు నీవు వదినెగారి దగ్గిరకైనా వెళ్ళు! ఆబిడ కోపం పోయేట్టు చూడు! ఆమెను ప్రసన్నురాలిని చేసుకో! ప్రొద్దూకులూ నాకాళ్ళట్టుకుని కూచున్నా నీ కేమీ దారి దొరకదు" అని మాధవుడన్నాడు.

బిందు వెంటనే కాళ్లొదిలేసి లేచి నిలబడి "కాళ్లట్టుకునే అలవాటు నాకు లేదు, అవి డారాత్రి నీరయినా ఇక్క డెందురు తాగలేదో, ఇంకా మీరీ సంగతంతా ఎరుగుండీనిన్నీ శత్రువులాగా నాకు చెప్పకుండా ఎందు కున్నారో ఆసంగతంతా నా కిప్పుడు తెలిసొచ్చింది. నాతప్పు ఎక్కువ చెయ్యడానికా మీరప్పుడు చెప్పకుండా ఊరుకుంట?" అని అన్నది.

మాధవుడు కాకితమ్మీద మనసు పెట్టి "నే నావిద్య మాఅన్నగారి దగ్గర నేర్చుకున్నాను. ఆలా ఊరకుండే ఒకనాడు దాటిపొయ్యేట్టుగా ఈశ్వరుడు నన్ను కరుణించాలి" అని అన్నాడు.

బిందు మరి మాటాడలేదు, తన గదిలోకి వెళ్లి తలుపేసుకుని పడుకుంది.

మాధవుడు లేచివెళ్లడానికి సిద్ధంగా ఉండగా బిందువాసిని మళ్లా అక్కడికి వచ్చింది. ఆమెకళ్లు ఎర్రబారినయ్. మాధవుడికి దయ కలిగింది— "ఇదిగో ఒక్కసారి అక్కడికి వెళ్లిరా ఆమె సంగతి నీకు తెలుసుగదా! ఒకసారి వెళ్లి ఊరికే నిల్చోవాలు. దాంతో అన్ని పనులూ అవుతయ్."

బిందు అత్యంత కరుణస్వరంతో ఇల్లా అంది: "ఇదిగో మీరు వెళ్లండి మీరు వెళ్ళకపోతే కుర్రాడి మీ దొట్టు!"

మాధవు డామె ఉద్దేశ్యం గ్రహించి కొంచెం వేడియెక్కి "నీవు వేయి వొట్లు పెట్టుకున్నా నేను పోయి అన్నగారితో చెప్పలేను. ఆయన స్వయంగా నన్నడిగితేనే తప్ప, నామెడ కోసి పారేసినాసరే, ముందస్తిగా వెళ్లి చెప్పే సాహసం నాకులేదు" అని అన్నాడు. మాధవు డిల్లా అన్నా బిందువాసిని అక్కడనుంచి కదలలేదు.

"నీవు వెళ్ళలేవా!" అని మాధవు డడిగాడు. బిందు జవాబు చెప్పక లేచి తలవంచుకుని మెల్లమెల్లగా వెళ్లిపోయింది.

---

౮

మేడయెదటనుంచే బళ్లోకి వెళ్లేదారి. మొట్టమొదట కొన్నాళ్లపాటు గొడు గడ్డం పెట్టుకుని అనంతం ఈదారినే వెళ్లేవాడు. రెన్నాళ్ళనుంచీ ఆ ఎఱ్ఱగొడుగీ దార్లో వెళ్ళడంలేదు. బిందువాసిని మేడమెట్లమీది గదిచాటున దారికేసి కళ్లు పారేసి కూచుంటూంది. చూచిచూచి ఆమెకళ్లు పగిలిపోతున్నై. పొద్దున తొమ్మిది పదిగంటలప్పుడు ఎన్నోరకాల గొడుగులు మీద వేసుకుని ఎందరో పిల్లలాదారినే వెళ్లారు. బడివిడిచాక ఎందరో ఆదారినే వచ్చారు. అనడకగాని, ఆ గొడుగుగాని బిందుకు కనబడలేదు. ఆమె సాయంకాల మప్పుడు కళ్లు తుడుచుకుని మేడ దిగి, నరహరిని చాటుగా పిలిచి—"బళ్లోకి సూటిగాపోయేదారి ఇదేకదూ! ఈదార్లో అతడుకనబడడేం?" అని అడిగింది.

నరహరి జవాబుచెప్పలేదు.

"సరేకాని, నరహరీ! మీరిద్దరూ మాటా మంతీ చెప్పుకుంటూ ఈ దారినే వెళితే బావుంటుంది. ఏం బాగుండదూ?"

నరహరి ధోరణిలో అనంతమంటే ప్రాణం. కాబట్టి మెల్లమెల్లగా— "వా డీదారే పోవడానికి సిగ్గుపడుతున్నా డత్తా! అల్లాల్లా తిరిగితిరిగి చుట్టు దారినే పోతున్నాడు." అని అన్నాడు.

బిందు కష్టమ్మీద నవ్వి—"సిగ్గెందుకు, ఎబ్బె! ఈదారినే రమ్మని నీవు చెప్పు" అని అన్నది.

నరహరి తల తిప్పి—"ఇహ ఈదారిని రాకేం? అయితే ఎందుకు రాడో తెలుసా?" అని అన్నాడు.

బిందు కుతూహలంతో — "ఎందుకు" అని అడిగింది.

"నీకు కోపం రాదూ?"

"ఎబ్బె, రాదు."

"ఈమాట వాళ్ళయింటికి చెప్పంపవూ?"

"ఎబ్బె, చెప్పంపను."

"మా అమ్మకు చెప్పవూ?"

బిందువాసిని మరి ఆలస్యం సహించలేక—"ఎవ్వరికీ చెప్పన్రా!" అని అన్నది.

నరహరి మెల్లగా ఇల్లా అన్నాడు: "మూడో పంతులున్నాడే, ఆయన అనంతం చెవులు దిరంగా మెలేశాడు" అని అన్నాడు.

అనంగానే బిందు మండిపడి, "ఎందుకు మెలేశాడు? నేను ఒంటిమీద ఎన్నడూ చేయి వేయవద్దని చెప్పలా?" అని అన్నది.

నరహరి చేయి తిప్పి, "ఆయన తప్పేముందత్తా? ఆయనసలు కొత్త వాడు మన నవుకరు ఈ ఉళక్కిగాడున్నాడే, వీడు ఫుంధాకోర్. వాడొచ్చి మా అమ్మకు చెప్పాడు. మా అమ్మకూడా తక్కువదనుకున్నావేమో, అది అంతకంటె ఫుంధాకోర్. అది మూడో పంతులుగారికి కబురు పెట్టింది. ఆపళంగా పంతులు ఆ ఆస్కారం చూచుకుని వాడి చెవులు మెలిపెట్టాడు. ఎల్లా మెలిపెట్టాడనుకున్నావత్తా! ఇదిగో, ఇల్లా లంకించుకుని—

బిందు అక్కడి కాపించి, "సరేకాని ఉళక్కిగాడేమని చెప్పాడు?" అని అన్నది.

"ఉళక్కిగాడు నాకు బళ్ళోకి టిఫిన్ తెచ్చి పెడతాడుగా, మొన్న అలావాడు తేగా చూచి అనంతం నాదగ్గిరికి పరుగెత్తుకొచ్చి "ఏం తెచ్చాడో చూపు" అని అన్నాడు. ఉళక్కిగా డీసంగతి మా అమ్మకు చెప్పాడు. మా అమ్మకు చెపితే అది "వాడికి చూపకు, వాడు చూస్తే దిష్టి కొడుతుంది. ఈ సంగతి పంతులుగారితో చెప్పు, అని చెప్పంపింది."

బిందు "అనంతు కెవరూ టిఫిన్ పట్రావటల్లా?" అని అడిగింది.

నరహరి ఒకసారి మొహమ్మీద చేత్తోకొట్టుకొని "ఎక్కడినుం చొస్తుం దత్తా? పాపం, వాళ్ళు పేదవాళ్ళు వాడు అటుకులు కాసిని జేబులో పోసు కొచ్చి చెట్లచాటుకుపోయి అక్కడ కూచునితింటాడు" అని అన్నాడు.

ఈమేడా, ఈమిద్దే, ఈసృష్టి సమస్తమూ బిందువాసిని కళ్ళముందు ఊగిస లాడిపోవడం మొదలుపెట్టింది. ఆమె అక్కడే కూలబడి, "నరహరీ మంచిది, ఇహ నీవు పో" అని అన్నది.

ఆరాత్రి ఎన్నిసార్లో పిలిచాక బిందు విస్తరిముందుకు పోయి కూ చున్నదే కాని ముద్దమాత్రం ఎత్తలేకపోయింది. చిట్టచివరకి "వంట్లో యేమీ బాగాలే" దని చెప్పి విస్తరిముందునుంచి లేచి వెళ్లిపోయింది. అమరురోజు గూడా ఉపవాసం పడుకుంది. ఇంతే కాకుండా ఎవరితోనూ ఒకమాటకూడా మాటాడలేక పోయింది. ఎంత వెతికినా ఆమెకు దారి దొరకలేదు. ఏమా టంటే తన తప్పు ఎక్కడెక్కడైవై పోతుందోననే భయమే ఆమెకు పట్టుకుంది, అపరాహ్ణ వేళ మగడు భుజించేటప్పుడు అలవాటు చొప్పున దగ్గిర కూచుం దేకాని మొహంమాత్రం ఆతలికి తిప్పుకునికూచుంది. నిన్నటినుంచీ ఆమెకు తినుబండాలను చూడడానికికూడా ఇష్టం తప్పింది.

ఇంట్లో దివ్వె వెలుగుతూంది మాధవుడు కన్నులు ముకుళిస్తూ కూచుని వున్నాడు. బిందువచ్చి కాళ్లముందర కూచుంది. మాధవు డాచిమాచి "ఏమిటి?" అని అన్నాడు.

బిందు తల వంచుకుని మగని కాలిగోరు ఆడించటం మొదలు పెట్టింది.

మాధవు డామెమనస్సు కనిపెట్టి జాలిపుట్టి ఇలా అన్నాడు: "నాకు నీసంగతంతా తెలుసుగాని నీవు నాదగ్గర ఏడిస్తే ఏమి లాభం ? ఆమెదగ్గరకు వెళ్ళు."

బిందు నిజంగానే ఏడుస్తూంది. "మీరు వెళ్ళండి" అని అన్నది.

"నేను నీతరఫున వెళ్లి మాటాడితే అన్నయ్య వినిపోడూ?"

బిందు ఆమాటకు జవాబు చెప్పక "ఇదిగో, నే నొప్పేసుకుంటున్నా, నాదేతప్పు, నేను క్షమాపణకోరుతున్నా, మీరుపోయి చెప్పండి" అని అన్నది.

"ఆపని నాచేత కాదు" అని మాధవుడు పక్కకు తిరిగి పడుకున్నాడు.

మగడు వెళతా డనే ఆశతో బిందువాసిని మరి కొంతసేపక్కడ కని పెట్టు కూచుందిగాని అతడేమీ మాటాడకపోయేసరికి మెలమెల్లగా లేచి వెళ్లి పోయింది. మగని వ్యవహారంవల్ల ఆమెకు చాలా కష్టమయింది. అది ఒక యోజనం పొడుగు కొండల్లే ఆమె హృదయంలో ఆ మూలనుంచి ఈ మూల దాకా ఒక చిటికెలో వ్యాపించింది. తన సందరూ పరిత్యాగం చేసేశారని ఆమె కిప్పుడు నిస్సంశయంగా తెలిసిపోయింది.

మర్నాడు పొద్దున్నే యాదవుడు బిందువాసిని తండ్రిగారికి చాలా జబ్బుగా ఉన్నదనిన్నీ, ఆమెను వెంటనే పుట్టింటికి పంప మనిన్నీ తమ్ముడికి ఒక ఉత్తరం రాసి పంపాడు. బిందువాసిని కన్నీరు విడుస్తూ బండెక్కింది. పంప వచ్చిన కాత్యాయని—"నాయనగారికి నిమ్మళం కాగానే రండమ్మా?" అని అన్నది.

బిందు బండి దిగి ఆమెకు దణ్ణంపెట్టి చాలా చిన్నబోయింది. బిందు ఇల్లా నమస్కరించడమూ, ఇంత నమ్రంగా ఉండడమూ ఇదివరకెన్నడూ ఎవరూ చూడలేదు. బిందు ఇలా దణ్ణంపెట్టి, "నీ వెల్లాగయినా పెద్దదానవు. నన్ను దీవించు ఏమనంటే—నేను మళ్లీ తిరిగిరాకుండానూ, ఈ వెళ్లడమే కడసారి వెళ్లడంగానూ! దీవించు" అని అన్నది.

కాత్యాయని అందు కేమీ బదులుచెప్పలేక పోయింది. వసివాళ్లు వాడిన బిందువాసిని మొహంకేసి చూచి ఆమె బావురుమన్నది.

వేణమ్మ దగ్గరేఉంది. "ఏమిటమ్మా, అంతా మహా? లోకంలో యెవరి తండ్రికి జబ్బుచేయడం లేదూ?" అని గణగణమన్నది.

బిందు జవాబు చెప్పక ముఖం తిప్పుకుని కళ్లు తుడుచుకుంది. కొంచెం సేపాగి "మీకూ కూడా నమస్కారాలు వదినెగారూ! నాకు సెలవు" అని అన్నది.

"వెళ్ళవమ్మా వెళ్ళు! నే నింట్లో సమస్తమూ సంబాళించుకుంటూ" అని అన్నది.

బిందు మరి మాటాడక బండెక్కింది బండివాడు గుర్రం తోలాడు.

కాత్యాయని ఈ సంగతంతా అన్నపూర్ణకు చెప్పింది. ఆమె విని ఊరుకుంది, బిందు ఇదివరకెన్నడూ అనంతుణ్ణి వదిలిపెట్టి పుట్టింటికి వెళ్లలేదు. ఇప్పుడతనిని చూచికూడా సెలవు పైగా కావచ్చింది. బిందు దుఃఖం అన్నపూర్ణ కిపుడు తెలిసి వచ్చింది.

రాత్రి తండ్రిదగ్గర పడుకొని అనంతు ఆమాటలు ఈమాటలూ చెపుతున్నాడు. దీపపు వెలుగులో కూచుని గంత కుట్టుకుంటూ హఠాత్తుగా నిట్టూర్చి అన్నపూర్ణ దేము డీ గండం తప్పించాలి, దేము డీగండం తప్పించాలి! ఈ వెళ్లడమే కడసారి వెళ్లడం కావాలని వెళ్లేప్పు డనుకుందిట! అమ్మవారు చల్లగా చూచి మా అమ్మను మళ్లా మాయింటికి తిన్నగా చేర్చాలి" అని అనుకుంది.

యాదవు డీమాటలు విని లేచి కూచుని "మొట్టమొదటినుంచీ తిన్నగా చేశావుకావు. మా అమ్మ స్వభావం మీకెవరికీ దొరకపట్టలే" అని అన్నాడు.

అన్నపూర్ణ—"అదికూడా అక్కయ్యా అనుకుంటూ ఒక్కసారి ఇక్కడికి వొచ్చిందికాదు. తన కొడుకును బలవంతంగానయినా తీసుకోపోవడానికి సమర్థురాలు; అలాయినా తీసుకోకుండా పోయింది. ఆనాడు పొద్దా

కులూ పని చేసిచేసి తిరిగొస్తూంటే నాలుగుమాటలూ పెట్టింది ఏం చెయ్యమన్నారు?” అని అన్నది.

“మా అమ్మ సంగతి నా కొక్కడికే తెలుసు. కాని నీవు మా అమ్మను క్షమించకపోతే నీకు ఇన్ని ఏళ్లు వచ్చి యెందుకు? నీ వెటువంటిదానివో మాధవుడుకూడా అటువంటివాడే, మీ రిద్దరూకలిసి మా అమ్మ ప్రాణాలు బంధించి వధచేసి పారేశారు” అని యాదవు డన్నాడు.

అన్నపూర్ణ కన్నులనుండి జలజలా నీళ్ళు రాలడం మొదలుపెట్టెయ్.

అనంతుడు “నాన్నా! అమ్మ రానని ఎందుకు చెప్పిపోయింది?” అని అడిగాడు.

అన్నపూర్ణ కళ్లు తుడుచుకుని “మీ అమ్మదగ్గిరికి వెళతావూ?” అని అడిగింది.

అనంతుడు తలతిప్పి “వెళ్లను” అని అన్నాడు.

“ఎంచేత వెళ్ళవురా! అమ్మ మీ తాతయ్యగారింటికి వెళ్లింది. నీవు కూడా రేపు వెళ్లు” అని అన్నపూర్ణ అన్నది.

అనంతుడు మాటాడ కూరుకున్నాడు.

యాదవుడు “వెళతావా అనంతా” అని అడిగాడు.

అనంతుడు దిండుకింద తన తల కుక్కుకుని వెనుకటివలె తల తిప్పుతూ తిప్పుతూ “వెళ్లను” అని అన్నాడు.

బాగా పొద్దుండగానే యాదవుడు కచేరీ పనిలోకి వెళ్లడానికి తయారవుతూ వుంటాడు. ఈ ప్రసంగం జరిగిన అయిదారు రోజుల తరువాత ఒక నాడు అతడు మామూలుగా లేచి కచేరీకి వెళ్లడానికి తయారై మళ్లీ పోయి చట్టు' కూచుని నల్లమందు వేసుకుంటున్నాడు.

"వేళ కావచ్చింది" అని అన్నపూర్ణ అన్నది.

యాదవుడు తొట్రుపడి నల్లమందు అక్కడపెట్టి "ఇవ్వాళ నామనస్సేమీబాగాలేదు. రాత్రి మాఅమ్మ వచ్చి తలుపుచాటుగా నిలిచి నట్టయింది. శివశివ" అని అనుకుంటూ అతడు కచేరీకి వెళ్లాడు.

అన్నపూర్ణ పొద్దటిపూట వంటింట్లో అతికష్టంగా పని చేసుకుంటూ వుండంగా మేడలోంచి నవుకరు వచ్చి—"చిన్నమ్మగోరికి నాలా జబ్బుగా వుందిట! మరదిగారు చూడ్డానికి వెళ్ళారు" అని చెప్పాడు.

ఈమాట వినంగానే యాదవు డన్నమాటలు అన్నపూర్ణకు గుర్తువచ్చెయ్. ఆమె హృదయం కంపరమెత్తిపోయింది. ఆమె "ఏమి జబ్బురా" అని అడిగింది.

"ఆసంగతి తెలియదమ్మా! తెరపీమరపీగా ఉన్నదనిన్నీ, పెద్ద జబ్బే ననిన్నీ మాత్రమే విన్నానమ్మా" అని నవుక రన్నాడు.

సంధ్యాసమయానికి ఇంటికి వచ్చి యాదవుడు ఈకబురు విని ఆపురమని "నేను ఎంత సంబరపడి ఈ బంగారుబొమ్మను ఇంటికి తెచ్చుకున్నానో యెరుగుదువా? ఈ బొమ్మను నట్టేట్లోవిడిచి పెట్టేశావా? అహా! నే నిప్పుడే అక్కడికి వెళ్లాలి" అని అన్నాడు.

దుఃఖంచేతా పనిపాటలవల్ల కలిగిన ఆయాసంచేతా అన్నపూర్ణ హృదయం బద్దలవుతూంది. అన్నపూర్ణ కనంతంమ్మీదకంటెగూడా బిందు వాసినిమీద ఎక్కువప్రేమ. అటువంటి అన్నపూర్ణ కళ్లు తుడుచుకుని మగనికి నీళ్లిచ్చి సంధ్యావందనం చేసుకోడానికి బలవంతంగా కూచోపెట్టి వరాండాలోకి వెళ్లి చీకట్లో కూలబడ్డది. కొంతసేపటికల్లా వాకట్లో మాధవునిమాట వినబడ్డది. అన్నపూర్ణ అతికష్టంగా ప్రాణాలు బిగపట్టుకుని చెవులలో వేళ్లు గట్టిగా కుక్కుకుని రాయల్లే కూచుంది.

మాధవుడు వంటిల్లంతా చీకటిగా ఉండడం చూచి పక్కగా తిరిగి వస్తూ అంధకారంలో కూచునివున్న అన్నపూర్ణను చూచి శుష్కస్వరంతో "బహుశా వినే ఉంటారు" అని అన్నాడు.

అన్నపూర్ణ ముఖ మెత్తలేకపోయింది. మాధవుడు "అబ్బాయి ఇప్పుడు వెళ్లడం చాలా అవసరం. సమయం దగ్గిరికివచ్చినట్టు కనిపిస్తుంది" అని అన్నాడు.

అన్నపూర్ణ మొహం నేలకు తాకేటట్టు కింద పడిపోయి అవురు మన్నది. యాదవుడు పిచ్చివాడల్లే పరుగెత్తుకొనివచ్చి "అలా గెన్నడూ జరగదు మాధూ! అలా గెన్నడూ జరగదు. నే నెరిగికాని ఎరగకకాని యెవరికీ కష్టం కలిగించలేదు. భగవంతు డీవయస్సులో నా కిటువంటి శాస్తి యెన్నడూ చేస్తాడని అనుకోను" అని అన్నాడు.

మాధవు డేమీ అనలేదు. యాదవుడు "సంగతులన్నీ నాకు విప్పిచెప్పు నేనువెళ్లి మాఅమ్మను తీసుకొస్తాను. నీవేమీ గడబిడపడకు మాధూ! బండీ వాకట్లోఉందా?" అని అన్నాడు.

"నేను గడబిడపడడం లేదు. మీరే కొంచెం పడుతున్నారు" అని మాధవుడన్నాడు.

"ఎబ్బే, నేనేం గడబిడపడడం లేదు. ఇదిగో నేవ్! లే అనంతా, లేచి రా" అని యాదవు డనగా మాధవుడు "ఇప్పుడు వొద్దండీ, తెల్లారిన తరువాత——" అని అంటూవుండంగా యాదవుడు "కాదు కాదు. ఆలావీలు లేదు. నీవు ధైర్యం చెడగొట్టుకోకు మాధూ! బండీ పిలు! లేకపోతే నేను నడిచేవెళతా" నని అన్నాడు.

మాధవుడు మరి మాటాడక బండి తీసుకుని వచ్చాడు. నలుగురూ ఎక్కి కూచున్న పిదప యాదవుడు "ఊఁ తరువాత?" అని అన్నాడు.

మాధవుడు నేనయితే లేను. సరిగ్గా నాకూ తెలియదు. నాలుగు రోజులు జ్వరం కాసిందట! తరువాత మూర్ఛలు తరుచు రావడం మొదలు పెట్టినవట! అటుపైని ఎవరుగాని మందు మింగించలేకపోగా ఒక పాలచుక్క యినా తాగించలేకపోయారు! ఇప్పుడెల్లా వుందోకాని బతుకుతుం దని ఆశ లేదు" అని అన్నాడు.

"ఆశ లేకపోవడ మేమిటి? కావలసినంత ఉంది. ముమ్మాటికీ ఉంది. మా అమ్మ బతికేఉంది. మాధూ! భగవంతు డీ శేషవయస్సులో నానోటినుండి అబద్ధా లాడించడు. నే నింతవరకూ అబద్ధ మాడియెరగను" అని యాదవుడు గట్టిగా అన్నాడు.

మాధవుడు వంగి అన్నగారికి నమస్కరించి నిశ్శబ్దంగా కూచున్నాడు.

---

౬

బిందువాసిని అన్నం తినకుండా ఎన్నాళ్లనుంచి చిక్కుకొనిపస్తూందో ఆసంగతి యెవరూ తెలుసుకో లేకపోయారు. ఫట్టి టికి రాంగానే ఆమెకు జ్వరం ఆరంభమయింది.మరురోజు రెండుమూడుసార్లు మూర్ఛవచ్చింది. ఆఖరు తడవ వచ్చిన మూర్ఛ మరిపోలేదు. అనేక ఉపాయాలు చేసిన తరువాత ఆమెకు తెలివి కలిగింది. కాని నాడిమాత్రం కనబడలేదు. ఆస్థితిలో మాధవు డక్కడికి వెళ్ళగా బిందువాసిని మగనికి నమస్కారం చేసింది. అతడే పాలు నోట్లో పోయబోగా దంతాలుగట్టిగా బిగించుకుంది. ఎంత బతిమాలుకొన్నా ఒక్కచుక్కైనా మింగలేదు.

మాధవు డాశవదులుకొని "ఆత్మహత్య ఎందుకు చేసుకుంటావ్? అని అడిగాడు.

బిందు కళ్ళు మూసుకుని పడుకుని వుంది. ఆ కనుగొలుకులలోనుంచి కన్నీరు ధారగా ప్రవహిస్తుంది. కొన్ని నిమిషాలు గడచినతరువాత ఆమె మెల్లమెల్లగా నాకున్నది యావత్తూ అబ్బాయి కివ్వండి. రెండు వేలుమాత్రం నరహరి కివ్వండి. అతడికి చదువు చెప్పించండి. అతనికి అనంతు అంటే ఇష్టం"

మాధవుడు బలవంతంగా పళ్ళు బిగించుకొని ఏడుపు ఆపుకున్నాడు.

బిందువాసిని మరికొంచెం దగ్గిరికి రమ్మని సైగచేసి—"అనంతం తప్ప మరి యెవరూ నాకు కర్మ చేయుగూడదు" అని అన్నది.

మాధవు డీదెబ్బకూడా తట్టుకొని "ఎవరినయినా చూడాలని ఉందా?" అని మెల్లమెల్లగా అడిగాడు,

బిందు తలతిప్పి "వొద్దొద్దు" అని అన్నది.

తల్లి వచ్చి ఒకసారి మందు ఈయబోగా బిందు పళ్ళు బిగపట్టుకొని పడుకొంది.

మాధవుడు లేచి నుంచోని "అదేమిటి. అలాచెయ్యకూడదు మామాట విన్నావు కాదుకాని ఎవరిమాటయితే నీవు తీసేయలేవో వారిని తీసుకురావడానికి పోతున్నాను. నేను తిరిగివచ్చేదాకా మాత్రం ఇల్లా ఉండు! ఈ నామాట తీసెయ్యకు!" అని మాధవుడు వెలుపలికివచ్చి కళ్ళు తుడుచుకున్నాడు. ఆరాత్రి బిందువాసిని సుఖంగా నిద్రపోయింది.

అప్పుడే సూర్యోదయం అవుతున్నది. మాధవుడు గదిలోకి వెళ్ళి దీపం ఆర్పి కిటికీ తలుపులు తెరిచాడు. బిందు మొహమెత్తి తనయెదుటనున్న మగని మొహం చూచి మెత్తగా నవ్వి "ఎప్పుడొచ్చారు" అని అన్నది.

"ఇదేరావడం మీ అన్నయ్య పిచ్చివాడిలాగు ఏడుస్తున్నారు."

"నాకాసంగతి తెలుసు! వారి పాదధూళేమయినా కొంచెం తెచ్చారా?" అని బిందు మెల్లగా అడిగింది.

"ఆయన వాకట్లో అరుగుమీద కూచుని నల్లమందు వేస్తున్నారు. వొదినె గారు కాళ్ళు కడుగుకుంటున్నారు. అనంతం ఇంకా నిద్దుర వదలలేదు. తీసుకుని వెళ్ళి మేడమీద పడుకోపెట్టాను. ఇక్కడికి తీసుకురానా?" అని మాధవుడన్నాడు.

బిందు కొంచెంసేపు ధైర్యం చిక్కబట్టి, "వద్దు, కాసేపు పడుకోనీండి!" అని మెల్ల మెల్లగా పక్కకు తిరిగి మొహం ఆతలిపక్కకు పెట్టి పడుకుంది.

అన్నపూర్ణ గదిలోకి వెళ్ళి మంచము మీద కూచుని తలమీద చేయి వేయగానే బిందు ఉలిక్కిపడ్డది అన్నపూర్ణ రెండుమూడు నిమిషాలు తనను

తానే సంభాళించుకుని "మం దెందుకు పుచ్చుకోడం మానేశావు చెల్లీ! చావాలనా?" అని అన్నది.

బిందు జవాబు చెప్పలేదు. అన్నపూర్ణ ఆమె చెవిలోకి నోరుపోనిచ్చి "ఇదిగో నాగుండెలు పగిలి పోతున్నాయ్, నీకు తెలియడం లేదూ?" అని అన్నది.

"తెలుస్తున్న దక్కా" అని బిందుకూడా అలాగే మెల్లమెల్లగా సమాధానంచెప్పింది.

"అలా అయితే మొహాం ఇటు తిప్పు, నిన్నింటికి తీసుకుపోవడానికి మీ బావగారు స్వయంగా వచ్చారు. నీ కుర్రాడు ఏడ్చియేడ్చి నిద్దరపోయాడు నామాటవిను, మొహాం ఇటు తిప్పు" అని అన్నపూర్ణ అన్నది.

అన్నపూర్ణ ఇల్లా అన్నా బిందు మొహాం ఇటు తిప్పలేదు. కాని తల తిప్పి 'ఊఁ. హుఁ. అక్కా! ముందు...'

'ముందూ లేదు వెనకా లేదు. ఈ ఒక్కసారీ యింటికి తిరిగి రా. నే చెపుతున్నా విను' అని అన్నపూర్ణ అన్నది.

అప్పుడు యాదవు దక్కడికి వచ్చి ద్వారందగ్గర నిలబడంగానే అన్నపూర్ణ బిందుమీద బట్ట కప్పింది. యాదవుడు తన వాత్సల్యానికల్లా పాత్రమైన మరదలిని ఒక్క నిమిషంచూచి కన్నీరు గడ్డలో కుక్కుకుని 'ఇంటికి పోదాం లే అమ్మా! నిన్ను నేను తీసుకపోవడాని కొచ్చాను' అని అన్నాడు.,

అక్కడ ఉన్నవా రందరూ యాదవుని మొహాం చూచి కంటనీళ్ళు పెట్టుకున్నారు. యాదవుడు మరో నిమిషం మాటాడక నిలుచుని, తరువాత 'నీ వింతదానవై ఉండంగా మాయింటికి లక్ష్మిగా నిన్ను తీసుకెళ్లడానికి వెనుక ఒకసారి వచ్చాను. వల్లా యిక్కడికి రావలసిన పని ఉంటుం దని అప్పు

డనుకోలేదు కాబట్టి మా అమ్మవు కాకావూ, విను నే నెప్పుడయితే వచ్చానో అప్పుడు నిన్ను తీసుకోనయినా వెళ్లాలి! లేకపోతే నే నిక అటు మొహం పెట్టకుండానయినా పోవాలి. ఎరుగవూ అమ్మా! నే నెప్పుడయినా అబద్ధం చెప్పానా? అని అన్నాడు.

యాదవు డీ మాట లని వాకట్లోకి వెళ్లిపోయాడు. బిందువాసిని మొహం ఇటుకేసి తిప్పి 'అక్కా ఏం పెటతావో పెట్టు! ఇక తింటాను. అబ్బాయిని నాదగ్గర పడుకోబెట్టి మీ రందరూ బయటికి వెళ్లి కాసేపు విశ్రాంతి తీసుకోండి. మరి వచ్చిన భయం లేదు-నేను చావను,' అని అన్నది.

సమాప్తి

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1950